

# గర్భాధాన విజ్ఞానం

## ఉత్తమ సంతానం కొరకు ఉత్తమ మార్గం





కర్త:

"సుమ్నార్థి"

(డా॥ కోడూరి సుబ్బారావు)

# గర్భాధాన విజ్ఞానం

(ఉత్తమ సంతానంకొరకు ఉత్తమ మార్గం)

వైదిక సంస్కృతీ పునరుద్ధారకుడు



**మహర్షి దయానంద సరస్వతి**


కర్త :

**"సుమ్నార్థి"**

**(డా॥ కోడూరి సుబ్బారావు)**



ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**

ఆర్యసమాజము - మేడిబావి, 12-10-586/6, వ్యాస్ నగర్,

ఇందిరానగర్ రోడ్ నెం. 2, వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.

గాయత్రీ గ్రంథమాల - 22
చతుర్థ ముద్రణ : 1000 ప్రతులు


సృష్టి సంవత్సరము : 197, 29, 49, 116.
విక్రమాబ్దము : 2072, కలియుగాబ్దము : 5116.
శ్రీ మన్మథనామ సం॥ శివరాత్రి - దయానంద బోధరాత్రి 7-3-2016

**మూల్యము : రూ. 50/-**
(తపాలా ఖర్చులు అదనము)

ప్రతులకు :

డా॥ కోదూరి సుబ్బారావు, వైదిక వానప్రస్థ సాధక ఆశ్రమం,
హనుమాపురము (B.O.), (Via) భువనగిరి గంజ్ - 508 117. (తెలంగాణ)

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు
12-10-586/6, ఆర్య సమాజము, మేడిబావి, ఇందిరానగర్ రోడ్ నెం. 2,
వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061. (తెలంగాణ)

విద్యా బుక్ డిపో, ఆర్యసమాజము ఎదురుగా,
సుల్తాన్‌బజార్, హైదరాబాద్ - 500 095. (తెలంగాణ)

శ్రీ పం. మురళీబ్రహ్మచారి
జూలమ్మగుడి వద్ద, రెజిమెంటల్‌బజార్, సికింద్రాబాద్. - 500 003. (తెలంగాణ)

ఆర్యసమాజము, కూచిపూడి, తెనాలి తాలూకా - 522 313. (ఆం.ప్ర.)

Printed at :
**PRINTSHOP**
Secunderabad
040-66320300



# పరమేశ్వరుని ఉపదేశం

**అచ్ఛిన్నస్య తే దేవ సోమ సువీర్యస్య**
**రాయస్పోషస్య దదితారః స్యామ ।**
**సా ప్రథమా సంస్కృతిర్విశ్వవారా**
**స ప్రథమో వరుణో మిత్రో ౨ అగ్నిః ॥**

**- యజుర్వేదము (7-14)**

ఓ దివ్యగుణయుక్త సౌమ్యులారా! ఓ మానవులారా! మీకు శుద్ధ పరాక్రమము నభివృద్ధిపఱచు ఈ అఖండిత వేదవిద్యా దానము నొసగుచున్నాను. ఈ విద్యా సుశిక్షాజనిత వేదసంస్కృతియే ఆదిమ సంస్కృతి. సర్వమానవులు స్వీకరించ యోగ్యమైనది. అది మీకు సుఖదాయక మగును గాక! సర్వ విద్యా ప్రకాశయుక్త శ్రేష్ఠపురుషుడు మీకు ప్రథమ మిత్రుడై ఈ 'వైదిక వైజ్ఞానిక సంస్కృతీ' మార్గమున మిమ్ము ముందుకు నడుపును గాక!

# తొలిపలుకులు (Foreword)

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ ।యద్ భద్రం తన్న అసువ ॥ (యజు. 30-3)

ఇది వైజ్ఞానిక యుగం. నేడు విజ్ఞాన శాస్త్రం ఎన్నో రంగాలలో పురోగమించి ఎన్నెన్నో సుఖసాధనాలను సమకూర్చిపెట్టింది. నేటి విజ్ఞానంలో ధర్మమునకు చోటు లేదు. తత్ఫలితంగా అందు స్వార్థం ప్రవేశించి మానవ వినాశనానికి కారణమగుచున్నది. ధర్మం, విజ్ఞానం ఒకే నాణెం యొక్క బొమ్మ, బొరుసుల వంటివి. విజ్ఞాన యుక్తముకాని ధర్మం; ధర్మయుక్తముకాని విజ్ఞానం వినాశకారకములు. ధర్మంలేని విజ్ఞానం ప్రమాదకర మగునట్లే విజ్ఞానంలేని ధర్మము ప్రమాదకరమే. అది మనను అంధకారంలోనికి గొనిపోవును.

నేడు ప్రపంచంలో విరివిగా ప్రచారంలోఉన్న వివిధ మత సాంప్రదాయాలలో విజ్ఞానవిరుద్ధ విషయా లెన్నియో చెప్పబడినవి. వాటిని నేటికిని నమ్ముచుండుట విచిత్రం. నాగరికతా శిఖరాల నందుకొన్నదని చెప్పబడు ఇంగ్లాండ్ వంటి దేశంలో నేటికిని భూమి బల్లపరుపుగా ఉన్నదని నమ్ము సంస్థ (ఫ్లాట్ ఎర్త్ సోసైటి) ఒకటి ఉన్నదనిన ఆశ్చర్యంగా ఉంది. ఇది వారి మతం నేర్పిన అజ్ఞాన పాఠం. విద్యాలయాలలో భూమి గుండ్రంగా ఉన్నదనియు, చర్చిలలో అదే భూమి బల్లపరుపుగా ఉన్నదనియు వారు నమ్మెదరు. నేటి మన హిందూ మతంలోనూ నవగ్రహారాధన మొదలగునవి యిటువంటివే. కాని, భారతీయుల మూల గ్రంథాలైన వేదాలందు విజ్ఞానవిరుద్ధ విషయం ఒక్కటియును గానరాదు. ఇంతేగాక, నేటి విజ్ఞానానికి మార్గం చూపగల ఎన్నో వైజ్ఞానిక సూత్రము లందు చెప్పబడినవి. భారతీయ మహర్షులు ఆ సూత్రాల ఆధారంతో ధర్మమును మేళవించి మానవకల్యాణము కొఱకు ఒక చక్కటి సంస్కృతిని రూపొందించిరి. ఆ వేద సంస్కృతియే నిజమైన వైజ్ఞానిక సంస్కృతి.

నేను ఒక జిజ్ఞాసువును, చిన్ననాటినుండియు విజ్ఞాన శాస్త్రమునందు అభిరుచిగలవాడను. మా కుటుంబ పరిస్థితులు అనుకూలించక పోవుటచే ఉన్నత విద్యాభ్యాసము చేయజాలకపోయితిని. తదుపరి అనారోగ్యంతో ఆసుపత్రులలో, ఆశ్రమాలలో గడిపితిని. నా పూర్వజన్మ సుకృతఫలంగా వేదధర్మంతో పరిచయమైనది. అది విజ్ఞానవంతముగ ఉండుటవలన దానిపై శ్రద్ధ యినుమడించినది. ఆర్య విద్వాంసుల హేతుబద్ధ వైజ్ఞానిక రచనల అధ్యయనం నా జిజ్ఞాసాదాహమును కొంత తీర్చినవి. అనారోగ్యం వలన పూర్తి తృప్తికలుగలేదు. వృత్తిరీత్యా వైద్యుడనగుటచే తీరిక సమయము చాల తక్కువ. దానికితోడు పాలు మాత్రమే ఆహారంగా తీసుకొను నా శారీరకశక్తికూడ స్వల్పమే. నా శారీరక బలహీనత మానసిక శక్తిని చాలా బలహీనపరచినది. ఇట్టి పరిస్థితులలో ఇటువంటి రచనకు పూనుకొనుట సాహసమే. ఐనను ప్రతినిత్యమూ సంధ్యావందనములో **"శృణుయామ శరదఃశతం – ప్రబ్రవామ శరదః శతం"** అను సంకల్పం నన్ను ఈ రచనకు పురికొల్పినది. ఈ సంకలన రచనకు ముఖ్యంగా డా॥ సత్యవ్రత్ సిద్ధాంతాలంకార్ గారి "సంస్కార చంద్రిక" ఆధారం. ఇది మొదటి భాగం మాత్రమే. ఈ శైలిలో మరి 5, 6 భాగాలు వ్రాసినగాని యిది పూర్తికాదు. రెండవ మూడవ సంస్కారాలైన పుంసవన, సీమంతోన్నయనాలను గురించి 'దౌహృదిని' అనే పేరుతో ఒక పుస్తకం వ్రాసి ప్రచురించటం జరిగినది. అదియును బహుళ ప్రజాదరణను బొందినది. ముఖ్యంగా యిది నూతన దంపతులు తప్పక చదువవలసిన గ్రంథం. ఇది వారికి చక్కని మార్గదర్శనం చేస్తుందని ఆశిస్తున్నాము.

దీనిని చక్కగా కంపోజింగ్ చేసిన శ్రీ చకిలం వినోద్ కుమార్ గారికి, ప్రింట్‌షాప్ వారికి, సహకరించినవారికి అందరికి ధన్యవాదములు.

వైదిక వానప్రస్థాశ్రమం,
హనుమాపురం, భువనగిరి

సుమ్నార్థి
(డా.కోడూరి సుబ్బారావు)

# ఈ గ్రంథంలో



**చదవండి - ఆలోచించండి - అనుసరించండి**
**ఉత్తమ మానవజాతిని నిర్మించండి**

ప్రియ పాఠకులారా !

ఈ 'గర్భాధాన విజ్ఞానం' మీకు వైదిక సంస్కృతి ఎంత మహత్వపూర్ణమైనదో, వైజ్ఞానికమైనదో, యుక్తిసంగతమైనదో కొంత అవగాహన కలిగిస్తుంది. కాని, నేడు అమలులోనున్న కర్మకాండ స్వార్థపరుల కపోల కల్పితాలతో పురాణోక్త సంస్కృతిగా ప్రచలితమైయున్నది. తమవరకే వైదికమనియు, మిగిలిన వారందరకు పౌరాణికమనియు పురోహితులు చెప్పుచున్నారు. కాని, వేదము సర్వమానవుల కొరకు చెప్పబడినట్లు వేదమే ప్రమాణీకరించుచున్నది -

**యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః ।**
**బ్రహ్మ రాజన్యాభ్యాం శూద్రాయ చ అర్యాయ చ స్వాయ చ**
**అరణాయ చ॥ (యజు. 26-2)**

పరమేశ్వరుడనైన నేను ఈ కళ్యాణకరమగు వేదవాణిని మానవ మాత్రు లందరికొఱకు ఉపదేశించుచున్నాను. అనగా- బ్రాహ్మణులకు, రాజన్యులకు, శూద్రులకు, వైశ్యులకు మరియు వీరందరి స్త్రీ, భృత్యుల కొరకు మఱియు అంత్యజుల కొరకు కూడా ఉపదేశించుచున్నాను. మీరును అట్లే ఉపదేశింపుడు.

మహర్షి దయానంద సరస్వతి గారు ప్రాచీన వైదిక సంస్కృతియందు మధ్యకాలంలో కలసిపోయిన దోషాలను తొలగించి 'సంస్కార విధి' యను గ్రంథమును రచించిరి. అది యంతయు వైజ్ఞానికంగా నున్నది. ఆ ప్రకారం ఆర్యసమాజ పండితులు అందరి యిండ్లలోను వేదోక్తంగా అగ్నిహోత్రవిధి పూర్వకంగా సంస్కారాలు చేయింతురు. మీరు వారిని సంప్రదించి ఆ రకంగా సంస్కారాలు - శుభకార్యాలు జరుపుకొనుట శ్రేష్ఠం.

**- ప్రకాశకులు**



# గర్భాధాన విజ్ఞానం

## (ఉత్తమ సంతానం కొరకు ఉత్తమ మార్గం)

### వైజ్ఞానిక మనగా....

వైజ్ఞానిక మనగా విజ్ఞాన సమ్మతమైనది యని భావం. విజ్ఞాన మనగా విశేషజ్ఞాన మని అర్థం. అట్లని మనం తెలిసికొన్నదానిలో విశిష్టమైనదే విజ్ఞాన మనుకొంటే అది రూఢిఅర్థమౌతుంది. ఈ పరిస్థితి ఆంగ్ల భాషలోని 'సైన్సు' పదమునకును ఉంది. లాటిన్‌లో "Seire" యనగా నేర్చుకోవడం (To learn) / లేదా తెలుసుకోవడం (To Know). దీని రూపాంతరమే ఆంగ్లంలోని సైన్సు (Science) పదము. కాన, దీని నిర్వచనాన్ని లోతుగా ఆలోచించవలసి ఉంది. ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ బ్రిటానికా ఏమంటుందంటే –

The Latin word scientia meant 'Knowledge', but the modern usage covers only certain kinds of knowledge whose area whoever, is now so vast that no man can grasp more than a fraction of them. Moreover, 'scientific' knowledge is extremely diverse, extending from subatomic reactions to mental process ; from mathematical laws of thermo-dynamics to the economics of race relation ; from the births and deaths of stars to the migration of birds ; from the study of ultra-microscopic viruses to theat of extra galactic nebulas ; from the rise and dissolution of cultures and crystal to the rise and dissolution of atoms and

universes. It includes both knowledge of the workings of living bodies and knowledge of the laws of thought, together with the nature of their disturbances.

-- Encyclopedia of Britanica (1967) Vol. 20 P.7.

"లాటిన్‌భాషలో" సైన్సు పదానికి అర్థం జ్ఞానం. ఈ పదం నేడు కొన్ని విషయాలకే పరిమితంగా వాడబడుచున్నది. కాని, అది యెంత విస్తృత మన ఏ వ్యక్తియు దాని ఒక అంశమును మించి తెలిసికొనలేదు. అంతేగాక, సైన్సు విషయాలు అనేక విధాల విస్తరించిఉన్నవి. – అణు, పరమాణు విజ్ఞానం నుండి మానసిక విజ్ఞానం వఱకు, అణుచలన గణితవిద్యల నుండి వివిధ దేశీయుల ఆర్థికగణిత (Economic) విద్యల వఱకు, నక్షత్రముల చావు పుట్టుకల నుండి పక్షుల వలస విద్యల వఱకు, అతి చిన్న బీజంలో దాగియుండు బహుసూక్ష్మజీవి (Virus) నుండి అనేక సూర్యకుటుంబాలతో కలిసి యేర్పడు ఆకాశగంగల వఱకు, సంస్కృతుల స్ఫటికముల పురోగమన తిరోగమనములు మొదలు అణు, విశ్వముల ఉత్థాన పతనముల వఱకు విస్తరించి ఉన్నవి. ఇందు ప్రాణుల శరీర ధర్మముల జ్ఞానం, మరియు ఆలోచనల ఉత్పత్తి యొక్క నియమాలు మరియు వాటిలోని విఘ్నముల, ఆటంకముల సంబంధమైన జ్ఞానం కూడా ఇమిడిఉన్నాయి."

ఇంత విస్తృత నిర్వచనం కలిగి ఉన్నప్పటికి ఇది అసంపూర్ణమే యగును. ఇందు స్పష్టత కూడా లేదు. ఏది విజ్ఞాన శాస్త్రపరిధిలోనికి వచ్చునో, ఏది రాదో ఇదమిత్థంగా చెప్పలేము. కాన, విజ్ఞులు దీనికి మరొక నిర్వచనం చెప్పిరి. అది యేదన -- "ఒక ప్రత్యేక పద్ధతిలో నిర్వహింపబడి పరిశీలించబడిన విషయాలను క్రోడికరించి, అవి యేవిధంగా వివరింప వచ్చునో తెలుపుతూ ఇకముందు ఏమి చేయాలో ఊహింప గలిగేలా చేసే జ్ఞానాన్ని విజ్ఞాన మనవచ్చు" నన్నారు.

ధార్మిక నమ్మకాలను, ఆచారాలను కూడా విజ్ఞాన శాస్త్ర పరిధిలోనికి తీసుకొని పరిశోధనలు జరుపవలసిఉంది. ఏలయన ధర్మ, విజ్ఞానాలకు అవినాభావ సంబంధం ఎల్లప్పుడు ఉంటుంది. సృష్టిలోని శాశ్వత ప్రాకృతిక నియమాలను విజ్ఞానమనియు, ఆ నియమాల ఆధారంగా మానవ సమాజ

ఉన్నతికి చేయవలసిన విధానాలను ధర్మమనియు ప్రాచీన ఋషులు (విజ్ఞానవేత్తలు) పేర్కొన్నారు. అందుచే విజ్ఞాన శాస్త్రం ధర్మానికి విరోధి కాదు. అట్లే ఏ ధర్మశాస్త్రమైనా శాస్త్రమా ? కాదా ? అని తెలిసికోవాలంటే ముందు అది విజ్ఞానమునకు అనుకూలమా ? ప్రతికూలమా ? అని తెలిసికోవాలి. అనుకూలమైనచో ధర్మశాస్త్రంగాను, లేకున్నచో మూఢనమ్మకంగాను భావించాలి. అందుచే **సత్యమే విజ్ఞానం, సత్యాచరణమే ధర్మం.** ఒక మేధావి చెప్పినట్లు "**A Religion that ignores Science commits suicide**" విజ్ఞానమును ఉపేక్షించు - అవహేళన చేయు ధర్మం (మతం) ఆత్మహత్య చేసికొనును."

విజ్ఞాన పదము మిగిలిన మతగ్రంథాలలో ఉన్నదో లేదో కాని ప్రాచీన భారతీయ వైదిక సాహిత్యమందును, తదుపరి గ్రంథములందును అది బహుళంగా కనబడుతుంది. ఆ గ్రంథాలలో విజ్ఞాన పదమునకు అపరాప్రకృతి జ్ఞాన మనియే అర్థం ఉంది. అపరాప్రకృతి అంటే మూలప్రకృతి నుండి స్థూలరూపంగా ఏర్పడిన ఈ ప్రపంచ పదార్థాలు. ప్రపంచ ప్రసిద్ధిపొందిన భగవద్గీతలో శ్రీకృష్ణుడు "**జ్ఞానం తేఽహం స విజ్ఞానం ఇదం వక్ష్యామ్యశేషత**" ... నేను నీకు ఈ జ్ఞానమును సంపూర్ణంగా విజ్ఞానపూర్వకంగా చెప్పెదనని ప్రతిజ్ఞచేసి ఈ విధంగా వివరించెను.

**భూమిరాపోఽనిలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।**
**అహంకార ఇతీయమ్ మే భిన్నా ప్రకృతి రష్టధా ॥**
**అపరా ఇయం..........** భ.గీ. 7-4-5

ప్రకృతి ఎనిమిది విధములుగా ఉంటుంది. అందు స్థూలములైన భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచ భూతములు, సూక్ష్మములైన మనస్సు, అహంకారము, బుద్ధి ఉంటాయి. వీటినే అపరా (ఇంద్రియాలకు దూరంగా నుండనిది) అని అంటారు. పరాప్రకృతి అంటే జీవాత్మ పరమాత్మలు. అవి ఇంద్రియాలకు పరా-దూరంగా ఉంటాయి. అంటే ఇంద్రియాలచే తెలియబడవు.

నేటి విజ్ఞానవేత్తలు కొన్ని మూలకాల (Elements) తో ఈ ప్రపంచ మేర్పడినదని అంటారు. వారు ఇంతవరకు అట్టి 105 మూలకాలను కనిపెట్టారు. అందు చాలావరకు (92) ప్రకృతిలో సహజంగా లభించేవి.

పరిశోధనశాలల్లో కృత్రిమంగా రూపొందించినవి. ఈ మధ్య మరికొన్ని మూలకాలను గుర్తించినట్లు చెబుతున్నారు. ఇవన్నియు ప్రాచీన ఋషులు చెప్పు పంచ భూతాలలో - పృథివి జల వాయు అగ్ని ఆకాశాలలో వర్గీకరించిన ఇమిడిపోతాయి. వీటి పరిజ్ఞానమునే నేడు సైన్సు-విజ్ఞానం అంటున్నారు. ఈ పదము లాటిన్ భాషలోని Scientia అను పదము నుండి వచ్చిన దని చెప్పుదురు. లాటిన్ భాష కన్నను అతి ప్రాచీనమైన సంస్కృత భాషలో దీనికి "సాంఖ్య" మను చక్కని పదము కలదు. సాంఖ్య మనగా ప్రపంచ మూల తత్త్వముల జ్ఞానమని అర్థం.

దృశ్యమానమైన ఈ 105 మూలకాలు లేక పంచ భూతాలే గాక మనస్సు, బుద్ధి, అహంకారము అను సూక్ష్మపదార్థాలను కూడా కార్యజగత్తునందే (సృష్టిలోని పదార్థాలందే) లెక్కించవలసి ఉంటుంది. ఏలనన అవియును ప్రకృతి నుండి ఏర్పడినవే. ఇప్పుడిప్పుడు మనస్సును గుర్తించుచున్నను దానిని ఒక పదార్థంగా ఆధునిక విజ్ఞానవేత్తలు అంగీకరించలేకపోవుచున్నారు. ఇక బుద్ధి, అహంకారములను గురించి నేటి విజ్ఞానానికి ఏమాత్రం అంతుబట్టటంలేదు. ప్రాచీన ఋషులు మనోబుద్ధి అహంకారముల పరిజ్ఞానాన్ని పూర్తిగా కలిగియుండుటయే గాక, ఈ పదార్థాలన్నీ ఎందుండి ఉత్పన్నమైనవో అట్టి మూలప్రకృతి జ్ఞానం కూడా కలిగియుండిరి.

ఆధునిక వైజ్ఞానికులు మూలకాలను కనిపెట్టినను అవి దేని నుండి ఉత్పన్నమైనవో అంతుబట్టక శూన్యంనుండి ఉత్పన్నమైనవని కొందరు చెప్పుచున్నారు. అణువు కొన్ని పరమాణువులతో నిర్మింపబడిన పదార్థం. అది విచ్ఛిన్నమైనపుడు ఉష్ణము (హీట్) మరియు ప్రకాశము (లైట్)గా పరిణతి చెందుచున్నట్లు గోచరమగుచున్నది. కాన, ఈ సృష్టికి తాప, ప్రకాశముల కన్న వేరొక మూలకారణం తెలియుట లేదు. ఆ తాప ప్రకాశాలును క్రమంగా లేకుండా పోవుచున్నవి - శూన్యమగుచున్న వనుచున్నారు. ఆధునిక విజ్ఞాన పితామహుడైన అరిస్టాటిల్ ప్రకృతినుండియే సమస్తం ఉత్పన్నమైన దనియు, ఆ ప్రకృతి శూన్యం నుండి ఉత్పన్నమైన దనియు నమ్మెను. విజ్ఞానశాస్త్ర మెంత పురోగతి చెందినను నేటికిని కార్యజగత్తుయొక్క మూలం కనిపెట్టలేక పోవుచున్నారు. శూన్యం నుండి ఉనికి గల సత్పదార్థ మెట్లుత్పన్న మగును?

"నాసతో విద్యతే భావః' అసత్తునుండి–(లేనిదానినుండి) భావపదార్థం–(ఉనికిగల పదార్థం) పుట్టుట గాని, 'నాభావో విద్యతే సతః'– సత్పదార్థమునకు – (ఉనికిగల పదార్థమునకు) అభావం – (లేకుండా పోవుట) గాని జరుగదని ప్రకృతి నియమం కదా! బాబాలు శూన్యంనుండి వస్తువులు పుట్టించలేరని వాదించు మనం శూన్యంనుండి ఈ ప్రపంచం పుట్టినదని చెప్పిన ఎట్లు ఒప్పుకొందుము?

ప్రాచీన ఋషులు ఈ అపరాప్రకృతి జ్ఞానమునే గాక పరాప్రకృతి జ్ఞానమైన ఆత్మ పరమాత్మల జ్ఞానాన్ని కూడా విజ్ఞానశాస్త్ర పరిధిలోనికి తీసుకొనివచ్చి ప్రతిజ్ఞచేసి లక్షణ ప్రమాణాలతో వాటిని సిద్ధింపచేశారు. ప్రత్యక్ష, అనుమాన, శబ్దాది ప్రమాణాలతో పరీక్షించి ప్రపంచానికి తెలిపారు. అవే షడ్దర్శనాలు. ఈ షడ్దర్శనాలకు మూలం వేదాలు. వేదాలు విజ్ఞాన నిధులు. అందు ప్రపంచమునగల సమస్త సత్యవిద్యలు గలవు. మహర్షి దయానందుడు మరుగున పడిపోయిన ఈ విజ్ఞాన నిధులను వెలుగులోనికి తీసుకొనివచ్చి ప్రపంచానికి మహోపకార మొనర్చెను. ఆ మహానుభావుడు నాలుగు వేదాలలో నున్న విషయాలను ఒక సూచికగా వ్రాశారు. ఆ సూచికయందు విజ్ఞాన విషయాలే ఎక్కువగా ఉన్నాయి. వాటిని వివరింప వేదములకు భాష్యము వ్రాయ ఉద్యమించారు. ప్రారంభమున వేదములందలి వివిధ విషయములను సంక్షిప్తపరచి వివరించుచు ఒక భూమికాగ్రంథాన్ని వ్రాశారు. అది 'ఋగ్వేదాది భాష్యభూమిక' అను పేరుతో మనకు నేడు లభిస్తుంది. అందు "వేదవిషయ విచారః" అను ప్రకరణంలో ఇట్లు వివరించారు.

"అత్ర చత్వారో వేదవిషయాః సన్తి – విజ్ఞాన కర్మోపాసనా జ్ఞానకాండ భేదాత్." తత్రాదిమో విజ్ఞాన విషయో హి సర్వేభ్యో ముఖ్యోఽస్తి, తస్య పరమేశ్వరాదారభ్యః తృణపర్యంత పదార్థేషు సాక్షాద్ బోధాన్వయత్వాత్ తత్రాపి ఈశ్వరానుభవో ముఖ్యోఽస్తి."

వేదములం దనేక విషయాలున్నను వాటిని నాలుగు విధాలుగా విభజింపవచ్చును. అవి 1. విజ్ఞానము, 2. కర్మము, 3. ఉపాసన, 4. జ్ఞానము. ఈ విభాగములనే కాండలనియు అందురు. ఇందు మొదటిదైన విజ్ఞాన విషయమే అన్నిటికన్నను ముఖ్యమైనది. అందు పరమేశ్వరుడు మొదలు తృణ పర్యంతము గల పదార్థాల సాక్షాత్‌బోధ కలుగును. ఆ పదార్థాలందు

అన్నిటికన్నను ఈశ్వరానుభూతియే ముఖ్యమైనది.

విజ్ఞాన పదమును మరికొంత వివరించుచు మహర్షి "కర్మోపాసనా జ్ఞానము లను మూడింటిని సరిగా నుపయోగించుకొనుటయు, పరమేశ్వరుడు మొదలు తృణ పర్యంతం గల పదార్థాలను బాగుగా తెలిసికొని వానివలన తగిన లాభమును పొందుటయు విజ్ఞాన మనబడు"నని తెలిపిరి. ఇంకను వారు 'ఈశ్వరునిచే రచింపబడిన పదార్థాలను, వాని గుణ స్వభావాలను బాగుగా విచారించి వానిచే నగు కార్యములను సిద్ధింప చేసికొనవలెను. ఈశ్వరుడు ఏ పదార్థాల నే ప్రయోజన సిద్ధికై నిర్మించెనో వాని నందుల కుపయోగించు కొనవలె' నని ఉపదేశించిరి.

అపరా, పరా విద్యలను గూర్చి స్పష్టపరచుచు మహర్షి "వేదము లందు అపరా, పరా అను పేర్లుగల రెండు విద్య లున్నవి. తృణము మొదలు ప్రకృతి పర్యంతముగల పదార్థాల గుణదోషముల నెఱిగి వానితో సిద్ధమగు కార్యాలను నిర్వహించుటను నేర్పునది అపరవిద్య యనబడును. సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుని యథార్థ జ్ఞానమును కలిగించునది పరావిద్య యనబడును, ఈ పరావిద్య అపరవిద్య కంటెను మిక్కిలి యుత్తమము, అపరవిద్య వలన నేర్పడు నుత్తమ ఫలమే పరావిద్య యగు" నని తెలిపిరి.

పై వివరణను బట్టి ప్రపంచ పదార్థాల జ్ఞానంతోనే తృప్తి నొందక వాటిని సరిగా నుపయోగించుకొని పూర్ణప్రయోజనం పొందవలెనని తెలియుచున్నది. ఆ పదార్థములందు పరమేశ్వర పదార్థము ముఖ్యమైన దనియు తెలియుచున్నది. అందుచే మన ప్రాచీన ఋషులు విజ్ఞాన రంగమున సామాన్య నిత్యావసరముల వఱకే కృషిచేసి మిగిలిన సమయమంతయు పరమేశ్వరుని పొంద యత్నించిరి. అట్లని సాంకేతిక జ్ఞానము (టెక్నాలజీ)లో ప్రగతి నేమాత్రము సాధించ లేదనుటయు సరికాదు. విదేశీ ఆక్రమణలతో జీర్ణశీర్ణమై కొద్దిగా నామమాత్రంగా మిగలియున్న భారతీయ ఖగోళ, జ్యోతిష, వైద్య, గణితాది శాస్త్రములే యిందుకు నిదర్శనము. ఆ గ్రంథములు నేటికిని విజ్ఞానవేత్తల కాశ్చర్యమును కలిగించుచు కొన్నిచోట్ల మార్గదర్శక మగుచున్నవి.

ప్రాపంచిక పదార్థ జ్ఞానం భారతీయ మహర్షుల దృష్టిలో సామాన్య జ్ఞానమే. అది కేవలం కార్యజగత్తు యొక్క వర్ణన మాత్రమే. కార్యజగత్తు యొక్క మూలమైన

ప్రకృతి సంబంధమైన జ్ఞానమే నిజమైన విజ్ఞానం. ప్రకృతితో పాటు పరావిద్య యనదగు ఆత్మ పరమాత్మల జ్ఞానం కూడా కలిసినపుడే అది పూర్ణమైన విజ్ఞానమగును. ఆ విజ్ఞానమందే వారు చాలా ప్రగతిని సాధించిరి. ఇక నేటి విజ్ఞానవేత్తలు అట్టి మూల విజ్ఞానమునందు చాలా వెనుకబడి యున్నారని చెప్పక తప్పదు. అయినను వారికి తెలిసిన కొద్ది ప్రపంచ జ్ఞానాన్ని పూర్తిగా సాంకేతికంగా ఉపయోగించుకొని ఉన్నతిని సాధించుచున్నారు. సాంకేతిక జ్ఞానంలో విజ్ఞానం కన్నను ఎక్కువ ఉన్నతిని సాధించిరనుటయు అతిశయోక్తి కాదు. ఉదాహరణకు భూమికి ఆకర్షణశక్తి కలదని తెలిసికొనుట, అణువిద్యుత్తును ఉత్పత్తి చేయుట మొదలగునవి విజ్ఞానము కాగా, దానితో గ్రావిటేషనల్ క్లాక్ Gravitational Clock తయారు చేయుట టెక్నాలజి (Technology) అగును. అణువు ఎలక్ట్రాన్, న్యూట్రాన్, ప్రోటాన్‌ల సంఘాతముగా తెలిసికొనుట విజ్ఞానం. ఆ విజ్ఞానంతో అణువుపై న్యూట్రాన్‌లను తాడింపజేసి అణువును భేదించి విద్యుత్తును, ఆటంబాంబును నిర్మించుట టెక్నాలజీ అగును.

అణువును భేదించవచ్చును. ఏలనన అది చిన్న చిన్న పరమాణువుల సంఘాతము. దానిని భేదించుట ఒక కళ. అందుకొరకు ఒక బట్టీని - రియాక్టర్‌ను నిర్మించవలసి యుండును. ఆ రంగములో నేటి విజ్ఞానవేత్తలు ఎంతో ప్రగతిని సాధించిరి. అట్లే, ఎన్నెన్నో సాధనాలను నిర్మించిరి. మానవ జీవనమును కొంత సుఖమయము చేసిరి. ఇందు ఏమాత్రం సందేహం లేదు. అందుకు వారిని అభినందించవలసినదే.

అయితే, ఆ విజ్ఞానంతో మానవ సమాజ నిర్మాణం జరుగవలసి యున్నది. అప్పుడే అది ధర్మమగును. లేకున్న ఆ విజ్ఞానం మానవ వినాశనానికి కారణభూతమై అధర్మమగును. భారతీయ ఋషులు సాంకేతిక విద్యలలో ప్రగతిని సాధింప ఎక్కువ ప్రయత్నం చేయకున్నను మానవ సమాజం యొక్క శారీరక, మానసిక, సామాజిక, ఆత్మిక ఉన్నతులను సాధించుటకు మార్గాల నిర్మించిరి. ఆ ప్రయత్నాలే నిజమైన వైజ్ఞానిక మని మా అభిప్రాయం. ఆ సదాచారం, సభ్యతాసంస్కృతులు ప్రాకృతిక నియమాలకు పూర్తి అనుకూలంగా నుండును. వాటిని ప్రత్యక్షాది ప్రమాణములతోనేగాక నేటి విజ్ఞాన పరికరాలతోనూ పరీక్షణకు గురిచేసి సత్యము నెరుగవచ్చును.

# సంస్కృతి యనగా..........

ప్రతి దేశం తన జాతిని, తన దేశీయులను చక్కని మార్గంలో నడిపించుకొనుటకు ఒక మార్గము నేర్పరచుకొనును. అది తాను నమ్మిన మతసిద్ధాంతముల ఆధారంగా నుండును. ఆ అభివృద్ధిమార్గమునే ఆ దేశ సంస్కృతి యందురు. ఆ సంస్కృతిని బట్టే ఆ దేశ వేషభాషలు, అలంకారాలు, సదాచారాలు, వేడుకలు, పండుగలు, శుభకార్యాలు, మర్యాదలు, వివిధ నృత్య సంగీత నాటక కళాదులు ఉండును. వీటి నన్నిటిని కలిపి ఒక్క మాటలో 'సభ్యత' అని చెప్పవచ్చును. సంస్కృతి జీవునకు సూక్ష్మశరీరంగా నున్న అంతః కరణము(మనసు)నకు చెందినదిగాను, సభ్యత బాహ్యాశరీరమునకు సంబంధించినదిగాను ఉండును. ఈ సభ్యతనే ఇప్పుడిప్పుడు నాగరికత యనుచున్నారు. ఇది పూర్తిగా సరికాదు. ఏలయన, నగరాలలో (పట్టణాలలో) నివసించువారిని నాగరికులందురు. అచ్చట ఎక్కువగా చదువుకొన్నవా రుండుటచేత వారి వేష భాషలు, మర్యాదలు పల్లెవాసులకన్న కొంత సంస్కరింపబడినవిగా నుండును. అట్లని పల్లెటూరువారు అనాగరికులు, సభ్యత తెలియనివా రనుటకు వీలులేదు. వారి బాహ్యావ్యవహారం కొంత మోటుగానున్నను, వారు కల్లకపటములు లేనివారై ఒకరికొకరు సాయం చేసికొనుచు ఐకమత్యంతో ఎక్కువ సంఘ (సంఘటిత) జీవులుగా నుందురు.

సభ్యత యనగా చక్కటి ప్రకాశమని అర్థం. ప్రకాశం బహిర్ముఖమై దూరంగా వ్యాపించును. ఆ ప్రకాశానికి వెనుక తైలము లేక విద్యుత్తు ఆధారంగా నుండును. ఆ యాధారమును బట్టే ఆ ప్రకాశ ముండును. అట్లే, సభ్యత యను ప్రకాశమునకు సంస్కృతి యను తైల మాధారము. ఆ తైలము దోషములు లేనిదై సంస్కరింపబడినదై శక్తివంతమైనదై యున్నచో ప్రకాశం ఉత్తమంగా నుండును. తైలము దోషయుక్తము, అల్పశక్తివంతము నైనచో ప్రకాశ మంతంతమాత్రముగా నుండును.

సంస్కృతి సభ్యతలు రెండును చాలావరకు జనులు నమ్మిన మతముపై

నాధారపడి యుండును. మత మనగా అభిప్రాయ మని అర్థం. ఒక ఆదర్శ పురుషుడు, సంఘ సేవాభిలాషి తన జాతిని (దేశీయులను) సంస్కరించి మంచి మార్గమున నడుప యత్నించును. అనంతరం ఆ మార్గమే అతని పేరుతో ఒక మతముగా నేర్పడును. అతని ఆ సంస్కరణ అతని బుద్ధి వైశిష్ట్యమును బట్టి యుండును. మానవు డెంత విద్వాంసుడైనను, పరోపకార సేవాపరాయణుడైనను అతడు అల్పజ్ఞుడు, అల్పశక్తిమంతుడు. ఇంతేగాక, అతడు అనేక జన్మల సంస్కారాలతో కూడియుండును. కొన్ని రాగద్వేషాలను కలిగియుండును. అందుచే తనకున్న కొద్ది జ్ఞానముతో ఆనాటి అన్యాయములను, అధర్మములను ఎదిరించి జాతిని ప్రబోధించును. ఆ ప్రబోధములే ఆనాడు మహోజ్జ్వలంగా ప్రకాశించును. కాలక్రమమున ఆ ప్రకాశం తగ్గుచుండును. అందు కొన్ని లోపములు బయట పడును. ఆ లోపములు మరికొన్ని మూఢ నమ్మకాలకు, అన్యాయ అధర్మాలకు అవకాశ మిచ్చును. అట్లే ఆ మతమువలన నిర్మింపబడిన సంస్కృతిలోకూడ లోపము లుండును. విజ్ఞాన వివేకములు పెరిగిన కొలది ఆ నమ్మకములు ప్రశ్నార్థకము లగును. ఆ ప్రశ్నలకు ఆ మతమునందు సమాధానం లభింపక వివేకవంతులు మరొక మతము స్వీకరించుటయో లేక నాస్తికులగుటయో జరుగును.

ఆస్తికులు ఈశ్వరు నంగీకరించుటతో బాటు ఈశ్వరీయ జ్ఞానమును కూడ నంగీకరింతురు. ఈశ్వరుడు మానవులకు జ్ఞానమొసంగుట వలననే మానవులు జ్ఞానవంతులైనారనియు, లేకున్న పశుతుల్యులుగానే యుండెడివా రనియు వారు నమ్ముదురు. ఆ ఈశ్వరీయ జ్ఞానము తమ మత గ్రంథమే ననియు, భగవంతుడు దానిని తన కుమారుని ద్వారా (ప్రవక్తద్వారా) మానవుల కందజేసినా డనియు వారు నమ్ముదురు. అంతియేగాక అదే అంతిమ సత్యమనియు ఒక గట్టి నమ్మకమును కలిగి యుందురు. కాని, తమది నిజంగా ఈశ్వరీయ గ్రంథమేనా? యని ఆలోచించరు. పరీక్షించి సత్యము నరయ యత్నించరు. ధర్మవిషయాలను నమ్మవలెనేగాని తర్కించరాదందురు. **'యత్ తర్కేణ అనుసంధత్తే స ధర్మః'** - 'తర్కమునకు నిలుచునదియే నిజమైన ధర్మ' మగు నను వివేకవంతుల మాటలు వారికి కటువుగా నుండును.

ఏ జ్ఞానమునందు ఈ క్రింది నాలుగు లక్షణము లుండునో అదియే నిజమైన

ఈశ్వరీయ జ్ఞాన మని సత్యాన్వేషకు లందురు.

1. మానవ సృష్టి ప్రారంభంలో ఏ జ్ఞానం మానవులకు లభించునో అదియే ఈశ్వరీయ జ్ఞానం. కాలాంతరంలో– కొన్ని యుగాలు, కొన్ని శకాలు గడిచిన తరువాత లభించునది కాదు. ఏలయన కొన్ని యుగాలు గడిచిన తదుపరి జ్ఞానాన్నిచ్చినచో ఈశ్వరుడు అంతకు పూర్వ తరముల కన్యాయం చేసినవా డగును.

2. ఆ జ్ఞానం ఏ ఒక దేశానికో ఒక ప్రాంతీయభాషకో చెందినది కాక విశ్వమానవులందరకు వర్తింప అనువైనదిగా నుండవలెను. అన్ని భాషలవారు సమాన పరిశ్రమతో పొందదగిన భాషలో నుండవలెను.

3. సృష్టి కర్తయైన ఈశ్వరుని జ్ఞానం గాన అందు సృష్టి నియమాలకు విరుద్ధమైన విషయా లుండరాదు.

4. కేవల ధర్మ విషయాలో, లేక కొన్ని నీతులో కాక అందు మానవులకు వలయు సమస్త విద్యలు ఉండవలెను.

పై లక్షణాలు ఏ మత గ్రంథము నందున్నవని పరీక్షించిన అన్ని మత గ్రంథములు వీగిపోగా ఆదిమ గ్రంథమైన వేద మొక్కటియే స్వయం ప్రకాశకమై నిలుచును. ఏ పురాతన మత గ్రంథమునకైనను మూడు నాలుగు వేల సంవత్సరములకు మించిన చరిత్ర కానరాదు. అంతకు పూర్వం కోట్లాది సంవత్సరాలు మానవజాతి ఏ మత గ్రంథము ననుసరించెను?

ఏ మత గ్రంథమైనను ఆ ప్రాంతీయ భాషకు చెందినదై యుండును. అట్లైన ప్రపంచ మానవులకు – మిగిలిన ప్రాంతములవారికి అది యెట్లు ఉపయోగపడును? విజ్ఞానం పెరుగు కొలది మత విశ్వాసములు ప్రశ్నార్థకములగుచున్నవి. నేటి కాలమున ఏ మత గ్రంథము, ఏ సాంప్రదాయక గ్రంథము పూర్తిగా సృష్టినియమాల కనుకూలంగా నున్నదని చెప్ప సాహసింపగలము? ఏ మత గ్రంథంలో మానవులకు కావలసిన అన్ని విద్యలు ఉన్నవి? మానవుని జ్ఞానం నైమిత్తకం కదా ? ప్రకృతిని పరిశీలించుచూ మానవుడు జ్ఞానవంతుడైనా డని యందురా ? అట్లైన ఏ పశు పక్షులు ప్రకృతితో బోరాడుచు సుఖ సాధనాలను నిర్మించుకొనుచున్నవి? విధి నిషేధాల నేర్పరచుకొని

సామాజిక జీవనము గడుపుచున్నవి? భార్యాపుత్ర బంధుబాంధవులతో గృహస్థజీవనము గడపుచున్నవి? ఇట్లాలోచించు కొలది ఎన్నెన్నో ప్రశ్నలుదయించును. ఏ మత గ్రంథము సందును, ఏ సాంప్రదాయక గ్రంథమునందును పై నాలుగు లక్షణాలు కానరావు. ఒక్క వేదమునందే ఆ లక్షణములన్నియు గలవు. నేటికిని ధర్మమునకే గాక విజ్ఞానమునకును వేదాలు మార్గదర్శకంగా నున్నవి.

కొందరు చరిత్రనే సంస్కృతి యనుకొందురు. కానీ, ఇదియును సరికాదు. కాల ప్రవాహంలో ఒడిదుడుకుల నెదుర్కొని ముందుకు పయనించే జాతి జీవనవిధానము చరిత్ర యగును. అందు దేశ కాల పరిస్థితుల ప్రభావమే అధికంగా నుండును. రాజకీయ ఒత్తిడులవలన, అజ్ఞాన అభావముల వలన కొన్ని ఆపద్ధర్మములుకూడ అందుచోటు చేసుకొనును. అట్టివి ముందుతరాలకు ఆదర్శంగా – సంస్కృతిగా ఎందుకు నిలుచును? ఏవైనా కొన్ని ఆదర్శములున్న అవి జాతికి ప్రేరణను, హెచ్చరికను కలిగించగలవే కాని మానవుని సంస్కరించి దివ్య మానవునిగా తీర్చిదిద్దగలవా ?

కాన, సంస్కృతి యనగా – మానవుని శారీరకంగా, మానసికంగా బౌద్ధికంగా, సామాజికంగా, ఆత్మికంగా తీర్చి దిద్దగలిగినది. అది మానవు లందరికి అన్ని వర్గాలకు, అన్ని కాలాలకు, అన్ని దేశాలకు వర్తించేదిగా ఉండాలి. అది వైజ్ఞానికంగా, ప్రకృతి నియమాలకు అనుకూలంగా, తర్కానికి, హేతువాదానికి నిలిచేదిగా ఉండాలి. ఇట్టి సద్గుణాలన్నియు వైదికసంస్కృతి యందున్నవి.

## భారతీయ సంస్కృతి

నేడు ప్రపంచంలో సాంస్కృతిక కార్యక్రమాల పేరుతో ప్రదర్శింపబడు విభిన్న జాతుల (దేశీయుల) నృత్య నాటక సంగీతాలను, ఆటపాటలను సంస్కృతి అని అంటున్నారు. అది సరికాదు. "సంస్కృతి" యనగా సంస్కరించునది యని అర్థం. మనిషిలోని చెడుగుణాలను దూరంచేసి మంచి గుణాలను నింపి అతనిని దివ్యమానవునిగా తీర్చిదిద్దగల్గినదియే సంస్కృతి అగును. నేడు ప్రపంచంలో కనబడు వివిధ సంస్కృతులు చాలావరకు భ్రమ ప్రమాదాలతో కూడియున్నవి. అవి మానవుని తన లక్ష్యం వరకు చేర్చజాలకున్నవి. అయిననూ

వాటి ఉద్దేశ్యం మాత్రం మానవోన్నతికి కృషిచేయుటయే.

భారతీయ సంస్కృతి వేదాల ఆధారంతో ప్రాచీన ఋషి మునులచే ఏర్పాటు చేయబడింది. ఇది హేతుబద్ధంగా, విజ్ఞానయుక్తంగా, మానవత్వానికి అతి సన్నిహితంగా ఉంటుంది. ఇది అతి ప్రాచీనమైన ఆర్యసంస్కృతి యని చెప్పవచ్చును. మానవజాతి ఈ భూమండలంపై ఉద్భవించిన తొలి దినాలలో ఋషుల హృదయాలలో పరమేశ్వర వాణియైన వేదం ప్రకాశింపబడింది. దానిని మననం చేసిన ఋషులు ఈ సంస్కృతిని నిర్మించిరి. అప్పటినుండి (దాదాపు నూట తొంబై ఏడు కోట్ల సంవత్సరాలనుండి) ఐదువేల సంవత్సరాలకు పూర్వం జరిగిన మహాభారత కాలంవరకు భారతదేశంలోను, ప్రపంచమంతటను ఈ సంస్కృతి ఒక్కటియే ఉన్నట్లు చరిత్ర చెప్పుచున్నది. ఒక్క వేదమతం తప్ప నేడు ప్రపంచంలో కనబడు వివిధ మతాలు, వివిధ సంస్కృతులు మూడు నాలుగు వేల సంవత్సరాల చరిత్ర కలిగినవి మాత్రమే. ఈ వైదిక సంస్కృతి ఒక్క భారతీయులకు మాత్రమే పరిమితమైనదికాదు. విశ్వ మానవులందరు అనుసరించ తగినది. **"సా ప్రథమా సంస్కృతిః విశ్వవారా"** (యజుర్వేదము 7-14) ఆ ప్రథమ సంస్కృతియైన వైదిక సంస్కృతి విశ్వమానవులందరి కొరకు ఏర్పరచబడినది యని వేదమే ప్రమాణీకరించుచున్నది.

భారతీయ సంస్కృతిలో అతి ప్రధానమైనవి "షోడశ సంస్కారాలు". జీవుడు ప్రారబ్ధ కర్మానుసారం అందుకు తగిన స్త్రీ గర్భంలో ప్రవేశించినది మొదలు గర్భంలో తొమ్మిది నెలలు పెరిగి, జన్మించి మరణించు వరకు పదునారు సార్లు మానవ జీవన మార్గాన్ని సంస్కరించుటకై ఈ క్రియలు ఏర్పడినవి. అందు కొన్ని శారీరక వికాసం కొఱకు, కొన్ని మానసిక బౌద్ధిక వికాసాల కొఱకు, మరికొన్ని ఆత్మోన్నతి కొఱకు నిర్దేశింపబడినవి. పూర్వ జన్మల సంస్కారాల (అనుభవాల) ప్రభావంతో మానవ స్వభావ ప్రవృత్తు లేర్పడినను పురుషార్థంతో వాటిని సంస్కరించి సరియైన మార్గములో పెట్టుట ఈ సంస్కారముల ప్రధాన ఆశయం. ఈ పదునారు సంస్కారముల సమిష్టి రూపమే 'భారతీయ సంస్కృతి' యగును. అది విజ్ఞాన సమ్మతమైనదని దిగ్దర్శనం చేయించుటకే మా ఈ చిన్న ప్రయత్నం.

నేటి విజ్ఞానం పురోగమన దశలో నున్నది. పురోగమించుకొలది దాని

ప్రాత సిద్ధాంతాలలోని దోషాలు తెలియుచున్నవి. అందుచే వాటిని అంతిమ సత్యము లనుటకు వీలులేదు. అట్టి సిద్ధాంతాల ఆధారంగా తొందరపడి ఋషుల వచనాలలో దోషము లెంచ యత్నించరాదు. ఋషి యనగా 'వేదమంత్రార్థద్రష్ట' యని అర్థం. వేదం సృష్టి రచయితయైన పరమేశ్వర వాణి. ఋషులు విద్యా తపస్సులతో యోగాభ్యాసం చేసి సమాధినిష్ఠులై ఆ యా మంత్రాలలోని సత్యార్థమును భగవంతుని ద్వారా గ్రహించినవారు. స్వార్థరహితులై కేవల పరోపకార భావనతో ఉపదేశించినవారు. కాన, వారి మాటలలోని సత్యము నందుకొన ప్రయత్నింతము రండు.

## సంస్కారములు - సంస్కృతి

ఒక వ్యక్తి ఉదారమైన స్వభావం కలిగి ప్రజాహితం కొరకు, దేశహితం కొరకు తన సర్వస్వాన్ని త్యాగం చేసినచో అతనిని గొప్ప సంస్కారవంతు డందురు. ఎవ్వరైనా చెడుపనులు చేసిన చెడు సంస్కారాల ప్రభావంతో ఈ చెడుపని చేసినా డందురు. దీనిని బట్టి ఒక వ్యక్తి చేసిన మంచి చెడు పనుల ప్రభావం అతని స్వభావంలో మరియు ప్రవృత్తిలో మార్పులు కలిగించు నని తెలియుచున్నది. అట్టి స్వభావంలో మార్పులు తీసుకొని రాగలిగిన కార్యాలను వైదిక భాషలో 'సంస్కారము' లందురు. ముఖ్యంగా ఒక వ్యక్తిలోని చెడు గుణాలను తొలగించి వాటి స్థానంలో మంచి గుణాలను నింపుట సంస్కార మగును. 'సంస్కర్త'యను పదము కూడ ఈ మూలధాతువు నుండి ఏర్పడినదియే. తన సమకాలీన సమాజంలో గల చెడు ఆచారాలను, చెడు సంప్రదాయాలను, చెడు నమ్మకాలను తొలగించి సమాజాన్ని చక్కని మార్గంలో నడిపించువాడు సంస్కర్త. కంసాలి బంగారంలోని దోషాలను తొలగించుటకు దానిని మూసలో వేసి కొలిమిలో కరగించుటను సంస్కార మనవచ్చును. జీవుడు అనేక జన్మలలో ఎనెన్నో మంచి, చెడు సంస్కారాలను పొందియుండును. అట్టి జీవుడు ఈ లోకంలో మానవుడుగా జన్మించినప్పుడు అతనిని ఉత్తమ సంస్కారాలతో నింపవలసియున్నది. అతనిలోని చెడు సంస్కారాలను తొలగించి మంచి సంస్కారాలను నింపుటయే ఈ సంస్కారాల ఆశయం. చరక మహర్షి తన స్వస్థవృత్తంలో **"సంస్కారో హి గుణాంతరాధాన ముచ్యతే"** అని చెప్పియుండెను.

అనగా దుర్గణాలను తొలగించి సద్గుణాలను ఆధానం చేయుట = నింపుట సంస్కార మనెను.

జీవుడు ఈ లోకంలో జన్మించుటకు పూర్వం తల్లి గర్భంలో ప్రవేశించును. తల్లి గర్భంలో తొమ్మిది నెలలు శరీర నిర్మాణం జరుగును. శరీరంతో బాటు మనోవికాసం కూడా జరుగును. మనసు క్రొత్తగా పుట్టినది కాదు. అది జీవునితో అనాదిగా వచ్చుచున్నది. అది జీవుని సూక్ష్మశరీరంలో నుండును. అతని వెంట ప్రతి శరీరంలో అదికూడా ప్రవేశించును. అందుచే ఆ శరీరం తల్లిదండ్రుల వంశపారంపర్య సంస్కారాలను కలిగియుండగా, అతని మనస్సు మాత్రం ఆ జీవుని జన్మజన్మాంతరాల సంస్కారాలను కలిగి యుండును. తల్లిగర్భంలో నుండగా ఆ జీవుని మనస్సు తల్లి మనస్సుతో కలిసియుండును. ఆ సమయంలో తల్లి తన లోపల పెరుగు బిడ్డ మనస్సుపై మంచి సంస్కారాలను నాటు అవకాశం ఎక్కువగా నుండును. అందుచే తల్లి శరీరాన్ని నిర్మించుటతోపాటు మనస్సును కూడా నిర్మించినదగును. కావున, శాస్త్రాలు **"మాతా నిర్మాతా భవతి"** యని ఘోషించుచున్నవి. మాత యనగా శరీర, మనస్సులను నిర్మించున దని అర్థం.

మానవ జీవితంలో పదహారు మారులు అతనిలోని చెడుగులను కడిగివేసి మంచి సంస్కారాలను వేయుటకు విశేష ప్రయత్నం జరుగవలసి ఉంటుంది. వాటినే **'షోడశ సంస్కారము'** లంటారు. ఇవి శరీరాన్ని, మనసునుకూడా సంస్కరించునవిగా నుండును. ఇవి కేవలం సాంప్రదాయకంగా వచ్చు ఆచారాలు కావు. వీని వెనుక ఎన్నో వైజ్ఞానిక రహస్యాలు దాగియున్నవి. ఇది వైజ్ఞానిక యుగం. కావున, వానిని వైజ్ఞానిక దృష్టికోణంతో పరిశీలించవలసి ఉంది.

మానవుడు ప్రయత్న పూర్వకంగా చేయు కర్మలు మెదడుపైన కప్పియుండు గ్రెమేటర్‌పై కొన్ని గీతలు గీయును. ఇవి చాలా సూక్ష్మంగా నుండును. వీనిని "ఎన్‌గ్రామ్స్" (Engrams) అందురు. ఇవి కొన్ని మంచివి కావచ్చును, కొన్ని చెడ్డవి కావచ్చును. మన మెదడులో "నేమే" (Mneme) యను సంచయన శక్తి యొకటి యుండును. అది ఎన్‌గ్రాముల నన్నింటిని ఒకటిగా కలిపి యొక అనుభవమును లేదా ఒక స్వభావమును కలిగించును. వేరువేరు కర్మలు వేరువేరు స్వభావాలను కలిగించక సమష్టి స్వభావాన్ని కలిగించుటకు ఈ

"నేమే" కారణభూతమగును. మనం అక్షరాలను వేరువేరుగా నేర్చుకొనెదము. పదములను కూడా అట్లే వేరువేరుగా నేర్చుకొనెదము. కాని, పెద్దవారమై క్రొత్త విషయాలను చదువునప్పుడు విడివిడిగా అక్షర, పద జ్ఞానము కలుగకయే దాని భావజ్ఞానం కలుగుచుండును. అది మెదడులో గల సంచయనశక్తివలన కలుగుచున్నది. దానికే డా॥ పర్వీనన్ అను మనోవైజ్ఞానికుడు "నేమే" అని పేరు పెట్టెను.

మనం తీసికొనిన ఆహారంలో వివిధ రకాల పదార్థాలున్నను అవియన్నియు కలిసిపోయి వాటితో వేరువేరు ధాతువులు నిర్మితమగునట్లు మనం ప్రయత్నపూర్వకంగా చేయు కర్మలన్నియు మనస్సుతో కలిసిపోయి మనస్సుపై ముద్రలు వైచి మన స్వభావంలోనే మార్పులు తెచ్చును. అందుచే మనం ప్రయత్నపూర్వకంగా పిల్లలచేత లేక పెద్దలచేత కొన్ని మంచిపనులు చేయించినపుడు వాటి ప్రభావం మనస్సుపై ముద్రలువేసి వారి స్వభావంలో మార్పులు తెచ్చును. అట్లే చెడు కర్మల ప్రభావంకూడా ఉండును.

సంస్కారాలను ప్రాచీనులు వాసనలనియును పేర్కొన్నారు. ఒక పాత్రలో ఏదైనా ఒక పదార్థాన్ని చాలాకాలం ఉంచిన ఆ పదార్థంయొక్క వాసన ఆ పాత్ర కంటును. ఆ పదార్థాన్ని తీసివేసిన తరువాత కూడా ఆ పదార్థపు వాసన ఆ పాత్రకు అంటియుండును. విశేష ప్రయత్నం చేసినగాని ఆ వాసన పోదు. అట్లే, మంచి చెడు కర్మలు మానవ మనస్సులో వాసనలను కలిగించును. వానిలోని చెడు వాసనలను మనం ప్రయత్నపూర్వకంగా పోగొట్టవలసి యున్నది. దానికై ఆ చెడు కర్మలనుండి తప్పించుటతోపాటు కొన్ని మంచి కర్మలను ప్రయత్నపూర్వకంగా చేయించిననేకాని ఆ చెడు కర్మల ప్రభావం తొలగదు. ఉదా : కిరసనాయిలు చేతికంటుకొనిన చెడ్డవాసన వచ్చును. చేతిని శుభ్రం చేసికొనినప్పటికి కొంత వాసన మిగిలి యుండును. అప్పుడు నెయ్యి లేదా కొబ్బరినూనె కొద్దిగా చేతికి రాచుకొనిన ఆ చెడు వాసన తొలగును. సంస్కారాలను ఇట్టి మార్పునే మనసులో కలిగించును.

భారతీయులు పునర్జన్మ నంగీకరింతురు. 'నేను, నేను' అని వ్యవహరించు జీవుడు క్రొత్తగా పుట్టువాడు కాడు. మరణించువాడును కాడు. ఈ సృష్టిలో అనాదిగా నుండువాడు. ఇంతకుపూర్వం కోట్లాది జన్మలు గడిచినవి. కోట్లాది

జన్మలు రానున్నవి. లేదా ముక్తి సుఖాన్ని అనుభవిస్తూ చాలా కాలం గడుపవచ్చును.

అనేక పూర్వజన్మలలోని సంస్కారాల ప్రభావమే నేటి మనుష్యుని మనస్తత్త్వం స్వభావం. అంతటి బలమైన స్వభావాన్ని మార్చుట కష్టసాధ్యమే. అయినను అసాధ్యంమాత్రంకాదు. నేటి మనోవిజ్ఞానవేత్తలు పూర్వజన్మలను పునర్జన్మలను అంగీకరించరు. వారి దృష్టిలో జీవుడు మరియు మనసు క్రొత్తగా పుట్టును. తల్లిదండ్రుల నుంచి ప్రాప్తించు జీన్స్ యొక్క ప్రభావం మనస్సుపై బలమైనదిగా నుండుననియు దానికి పరిసరాల ప్రభావం తోడై ఒక ప్రత్యేక వ్యక్తిత్వం - మనస్తత్వం ఏర్పడు ననియు వారు చెప్పుదురు. ఆశ్చర్యమేమనగా తల్లిదండ్రుల వంశాలలో లేని, పెరిగిన పరిసరాల పరిధిలో కూడా లేని కొన్ని గుణాలు, కొన్ని స్వభావాలు కొందరిలో కనిపించును. దానికి వారినుండి యెట్టి సమాధానమూ రాదు. ఈ జన్మలో ఎన్ని మంచి, చెడు సంస్కారాలు మెదడుపైన, మనస్సుపైన పడిననూ అవి యన్నియును మరణంతో నశించునని వారి అభిప్రాయం. ఇంతేగాక, మానవ శరీరంలోని కణాలలో నుండు సూక్ష్మాతి సూక్ష్మమైన "జీన్స్" వక్రించుటవలన కొన్ని విపరీత మనస్తత్వాలు ఏర్పడుననియు, వాటిని సరిచేయుట అసాధ్యమనియు వారు నమ్ముదురు. ఆ జీన్సు వక్రించుటకు గల కారణాలను వారు స్పష్టంగా చెప్పలేకపోవుచున్నారు. "జీన్స్" యొక్క దయాధర్మాల పైననే మానవుని ఆరోగ్యంతోపాటు మనస్తత్వమును ఉండునని వారి అభిప్రాయం. కళాకౌశలాలకు కూడా అవియే కారణమని వారి నమ్మకం.

ప్రాచీన ఋషులు దీని నంగీకరించరు. కార్యకారణ సంబంధం నిత్యమనీ, అది యెల్లప్పుడు ఉండునని వారు నమ్మిరి. పైన చెప్పిన వంశపారంపర్య, పరిసరప్రభావ భిన్నమైన గుణగణాలకు, స్వభావానికి తప్పక నొక కారణముండునని వారి వాదన. ఆ కారణమే పూర్వజన్మలు. జీవునకు స్థూల శరీరంతోపాటు సూక్ష్మ, కారణ శరీరాలు కూడా నుండును. స్థూలశరీరం మరణించిన పిదప జీవుడు సూక్ష్మ, కారణ శరీరాలతో పరమేశ్వరాధీనుడై మరియొక శరీరంలో ప్రవేశించును. ఆ క్రొత్త జన్మలో ఆ క్రొత్త తల్లిదండ్రులు గర్భంలో ఉన్నపుడు వేసిన సంస్కారములను కూడా కలుపుకొని జన్మించును. వానికి మరల పరిసర సంస్కారాల ప్రభావం తోడై ఒక క్రొత్త మనస్తత్వం

రూపొందును.

జీవుడు సూక్ష్మాతి సూక్ష్ముడు. బాహ్యేంద్రియాల చేత తెలియబడనివాడు. ఏ సూక్ష్మదర్శినితోను అతనిని చూడజాలం. అతడొక అభౌతిక పదార్థం. అట్టి జీవుడు శరీరంలో ఉన్నప్పుడు శరీరంతో సుఖదుఃఖాది అనుభవాలను పొందును. శరీరం పాంచభౌతికం. పంచభూతాలతో ఏర్పడినది. ఆ అభౌతిక జీవుని భౌతికశరీరంతో కలిపెడు విశిష్ట పదార్థమొకటి అవసరముండును. అదియే మనసు. ప్రాచీన ఋషుల దృష్టిలో మనసు ఒక పదార్థం. మూలప్రకృతి నుండి స్థూలపంచభూతాలు ఏర్పడునప్పుడు మొదటి మార్పుగా మహత్తత్వం పుట్టును. దానినుండి మనసు ఏర్పడును. అది జీవునకు సూక్ష్మశరీరంగా నుండును. అందుచేత అది ప్రాకృతిక పదార్థం. ప్రాకృతిక మైనప్పటికి చాలా సూక్ష్మమైనది. కాని, జీవునంత సూక్ష్మమైనది కాదు. పంచభూతాల వంటి స్థూలమైనదియును కాదు. మధ్యరకంగా నుండును. అందుచేత మనసు ఆ అభౌతిక జీవుని స్థూలశరీరంతో కలుపుచు మధ్యవర్తిగా పనిచేయుచున్నది.

ప్రాచీన ఋషుల దృష్టిలో సూక్ష్మశరీరం స్థూలశరీరంతో నాభిప్రదేశంలో కలియును. అందుచేతనే ఏదైనా ప్రాణభయం సంభవించినప్పుడు నాభియొద్ద అదురుపాటు, ఆందోళన కలుగును. యోగులు చెప్పెడు షట్చక్రాలు మనస్సు స్థూలశరీరంతో కలియు కేంద్రాలని చెప్పవచ్చును. ఈ జన్మలో కలిగిన సంస్కారాలు స్థూలమైన మెదడుపైన ఎన్‌గ్రామ్స్‌గా నేర్పడుటయే గాక సూక్ష్మశరీరంపై కూడా ముద్రలు వేయును. వాసనలను కలిగించును. అందుచేతనే ఈ జన్మలోని అనుభవాలు మరుజన్మకు కూడా ప్రాకును. యోగేశ్వర శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఈ విషయాన్ని వివరించుటకై ఒక చక్కటి ఉపమానం చెప్పియుండెను.

"శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః ।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గన్ధానివాశయాత్ ॥" భ.గీ. 15-8

**భావము :** వాయువు పుష్పాదులను అచటనే వదలి గంధమును దూరదూర ప్రదేశాలకు తీసికొనిపోవునట్లు జీవుడు మరణించిన పిదప శరీరమును

ఇచ్చటనే వదలి వాసనలతో కూడిన మనసును (సూక్ష్మ శరీరమును) తనవెంట గొనిపోవును.

లోకంలో మనం రెండు కథలు వినుచుందుము. మనం చేసెడు ప్రతి కర్మయు చిత్రగుప్తుని చిట్టాలో కెక్కుననియు, మరణానంతరం యమధర్మరాజుయొక్క సన్నిధిలో అవి విచారింపబడి ముందుగా చెడు కర్మలకు శిక్షగా జీవుడు నరకయాతనల ననుభవించి, తదుపరి మంచికర్మల పుణ్యం స్వర్గమున అనుభవించుననియు, తదుపరి మరియొక జన్మ యెత్తుననియు ఒక కథ వినుచుందుము. ఇది యథార్థంకాదు. స్వర్గ నరకాలు ప్రత్యేక లోకాలు కావు. ఈ శరీరమే లోకం. సుఖాలనిచ్చు శరీరం స్వర్గం, దుఃఖాల నిచ్చు శరీరం నరకం నగును. సూక్ష్మ శరీరమే చిత్రగుప్తుని చిట్టా అనవచ్చును. సూక్ష్మ శరీరంపై ముద్రించబడు ముద్రలే మనకు జన్మను, సుఖాదుఃఖాలను కలిగించును.

**మరియొక కథ :** బ్రహ్మదేవుడు మనలను పుట్టించినప్పుడు మన నొసటిపై చాలా చిన్నచిన్న అక్షరాలతో మన భవితవ్యాన్ని లిఖించుననియు, తదనుగుణంగానే ఆయువు, సుఖదుఃఖాలు, భోగభాగ్యాలు, మనస్తత్వం ఉండునని చెప్పునది. అంతేగాక, విధివ్రాతను - బ్రహ్మవ్రాతను ఎవ్వరూ మార్చజాలరనియును చెప్పెదరు. ఇదియును సత్యంకాదు. సూక్ష్మశరీరంలో నెలకొనియున్న అనేక కర్మలలో కొన్నిటిని అనుభవింపజేయుటకు పరమేశ్వరుడు ఒక జన్మనిచ్చి ఆయుర్భోగముల నిర్ణయించును. వీటినే ప్రారబ్ధమందురు. అయినప్పటికి జీవుడు కర్మలు చేయుటలో స్వతంత్రుడుగానే యుండును. అంటే ప్రారబ్ధము ననుభవించుచు పురుషార్థం చేయవచ్చును. ఉన్నతిని పొందవచ్చును.

వైదిక సంస్కృతిలో **'జీవుడు కర్మలు చేయుటలో ఎల్లప్పుడు స్వతంత్రుడు. వాని ఫలితము ననుభవించుటలో మాత్రం పరతంత్రుడు. పరమేశ్వరాధీనుడు.** దీనికి భిన్నంగా లోకంలో భ్రష్టదార్శనికవాదం ఒకటి ఉంది. పరమేశ్వరుడే మనచేత శుభాశుభకర్మల నన్నిటిని చేయించునని వారి మతం. ఇది చాలా తప్పు అభిప్రాయం. ఈ విషయాన్ని భగవద్గీతలో యోగేశ్వర శ్రీకృష్ణుడును స్పష్టం చేసియున్నాడు. **"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన"**- కర్మలు

చేయుటయందే నీ కధికారం కలదు. కాని, వాటి ఫలితాలపై నీ కధికారం లేదు. అది పరమేశ్వరాధీనం. వేదాలలో ఈ విషయం విస్తారంగా చెప్పబడింది. మనం చేసే కర్మలు మనమే చేస్తున్నాం. దేవుడు కాదు.

అద్వైత సాంప్రదాయం ప్రకారం - "జీవుడు దేవునియొక్క అంశం. జీవునకు, దేవునకు ఎట్టి భేదం లేదు. అంతఃకరణమే కర్మలను చేయును. వాటి ఫలములైన సుఖదుఃఖాలనుకూడా అంతఃకరణమే అనుభవించును. జీవుడు వాటికి సాక్షిగా నుండును. కాని, అజ్ఞానంవలన తన అంతఃకరణం అనుభవించు దుఃఖాలను తానే అనభవించుచున్నట్లు భ్రాంతి చెందును. ఇంతేగాక, జీవుడు కర్మలకు కర్తగాడు."

వైదిక సిద్ధాంతం ప్రకారం ఇది పూర్తిగా అసత్యం. పూర్వ ప్రకరణాలలో చెప్పుకొన్నట్లు శరీరం జడ పదార్థం. అట్లే అంతఃకరణంకూడా ప్రకృతియొక్క సూక్ష్మతత్వంతో ఏర్పడిన జడపదార్థమే. జీవునివలన అది చైతన్యవంతమై శరీరం ద్వారా కర్మలను చేయును. కనుక జీవుడే కర్తయగును. అందుచేతనే న్యాయదర్శనకారుడైన గౌతమ మహర్షి జీవుని గుణములను వివరించుచు **"ఇచ్ఛా ద్వేష ప్రయత్న సుఖ దుఖ జ్ఞానాని ఆత్మనో లింగమ్" (న్యాయ ద. 1-1-10)** అని చెప్పియుండెను. కోరికలు, వ్యతిరేకతలు, సుఖము లనుభవించుటకు జేయు ప్రయత్నములు, సుఖదుఃఖాది అనుభవం, జ్ఞానగ్రహణ సామర్థ్యం అను ఆరుగుణాలు జీవుని వని దీని భావం..............

ఒక హంతకుడు కత్తితో నొకనిని పొడిచి చంపినచో న్యాయాధీశుడు పొడిచిన వ్యక్తిని మాత్రమే శిక్షించును. కత్తినిగాని, కత్తిని చేసిన వానినిగాని, అమ్మినవానినిగాని శిక్షించడు. అట్లే, జీవుడు మనసుతో, శరీరంతో కర్మలను చేయును. మనసుకూడా ఒక ఉపకరణమే. కనుక దాని నుపయోగించు జీవుడే కర్త. మనసు కాదు. కర్త మాత్రమే ఫలము ననుభవింపవలెను.

మనం క్రొత్తగా వేయు సంస్కారాల ప్రభావం అనేక పూర్వజన్మల నుండి వచ్చుచున్న సంస్కారాలలో మార్పు తీసుకొని రాగలవా? అనునది ఆలోచించవలసిన విషయం. ఇందుకు ఒక్క మాటలో 'తప్పక మార్పు తీసుకొని వచ్చు'నని చెప్పవచ్చును. మనం ఏదైన ఒక చెడుపనిని మొదట చేయునప్పుడు భయ సంకోచాలు కలుగును. అదే చెడుపనిని మరల మరల చేయుచుండిన

భయ సంకోచాలు పోయి ఆ చెడు పని చేయటం స్వభావంగా మారును. ఉదాహరణకు : ఒక వ్యక్తి మొదటిసారిగా దొంగతనం చేయునప్పుడు భయంకలుగును. అది అంతరాత్మయైన పరమేశ్వరుని నుండి కలిగిన ప్రబోధం. ఇంద్రియాల బలాత్కారంవలన అంతరాత్మ ప్రబోధాన్ని అణచివేసి దొంగతనము చేయును. అప్పుడు పట్టుపడకపోయిన మరొకసారి దొంగిలించ యత్నించును. అప్పుడు కూడా భయ సంకోచాలు కలుగును. కాని, మొదటిసారి కలిగినంత కలుగవు. ఆ విధంగా మరికొన్ని సార్లు జరుగును. క్రమంగా భయ సంకోచాలు పూర్తిగా తొలగిపోయి దొంగిలించటం స్వభావంగా మారును. అట్టి స్వభావంలో మార్పు కలిగించి దానిని మంచిమార్గంలో పెట్ట ప్రయత్నించుటయే సంస్కారం. శిక్షాస్మృతి కూడా ఈ లక్ష్యం కొఱకే యత్నించును. సరిగా అమలు పరచినతప్పక మార్పు కలుగును.

ఒక బండిలాగు ఎద్దును గానుగ యెద్దుగా మార్చవలెనన్న దాని కళ్ళకు గంతలు కట్టి బలవంతంగ గానుగకాడిని దాని మెడకుగట్టి విశేష ప్రయత్నంతో దానిని తోలుకుంటూ కొంతకాలము దానివెంట నడువ వలసియుండును. కొంతకాలానికి అది దానికి అలవాటుపడును. గానుగకాడి మెడకు తగిలించగానే దానంతటది గుండ్రంగా తిరుగును. మరల ఆ గానుగెద్దును బండిలాగు ఎద్దుగా మార్చవలెనన్న మఱికొంత గట్టిప్రయత్నం చేయవలెను. బండియెద్దుగా అది మారగలదు. ప్రకృతిలో ఒక భౌతిక సూత్రం కలదు. "లా ఆఫ్ లీస్ట్ రెసిస్టెన్స్" అనగా ప్రతీ వస్తువు అల్ప ప్రతిరోధక దారివైపు నడచును. బండి బండ్లగాడివెంట నడుచును. అట్లే, జీవుడు స్వభావాన్నిఅనుసరించి కర్మలయందు ప్రవృత్తుడగును. అయినప్పటికి విశేష ప్రయత్నంతో మఱియొక ఉత్తమ మార్గమున గాడిని యేర్పరచవచ్చును. సంస్కారాల వల్ల సూక్ష్మశరీరంలో అదే మార్పు జరుగును.

తల్లిదండ్రులు సంస్కారవంతులైనపుడు ఈ మార్పు అధికంగా జరుగును. మానవ శరీరం రజో వీర్యాల కలయిక వలన ఏర్పడును. రజస్సులో అండం ప్రధానమైన పాత్ర వహించును. ఇది యొక చిన్న కణం. మానవ శరీరం చిన్న చిన్న కణాల సమూహం. ప్రతి కణంలోను 23 జతల క్రోమోజోము లుండును. ఒక్కొక్క క్రోమోజోమ్ 30-40 వేల జీన్స్‌ను కలిగియుండును.

ప్రతికణం ఈ విధమైన నిర్మాణం కలిగియున్నను అండంలో మాత్రం క్రోమోజోములు జతలుగా గాక 23 ఒంటరిగా నుండును. అందుచే ఇది పూర్తి కణం కాదు. అర్ధకణం. అట్లే పురుషుని వీర్యంలోని వీర్యాణువులు కూడా అర్ధకణాలే. 23 జతల క్రోమోజోములకు బదులుగా 23 ఒంటరి క్రోమోజోములు మాత్రమే ఉండును. వీర్యాణువు అండంతో కలిసినప్పుడు 23+23 క్రోమోజోములు కలిసి జతలుగా ఏర్పడి యొక పూర్తి కణ మగును. అట్టి కణం అత్యంత వేగంగా కణవిభజన చెందుచు క్రమంగా పిండంగా, శిశువుగా మారును.

వంశపారంపర్య లక్షణాలు తీసుకొని వచ్చునవి క్రోమోజములలో ఉండే జీన్సు. అంతేకాక, మనం ఎట్టి మనఃప్రవృత్తిని - స్వభావమును, కళాకౌశలాలను కలిగి యుందుమో క్రోమోజోములును అట్టి గుణములనే కలిగియుండును. కనుక, స్త్రీ పురుషులు ఉత్తమ భావములు కలిగినవారై యుండుట యెంతైనా అవసరము. ఈ విషయమును గర్భాధాన సంస్కారములో వివరంగా తెలిసికొందము.

సంస్కారాలలో తల్లిదండ్రులతోపాటు విద్వాంసులు, పురోహితులు, పెద్దలు పాల్గొనెదరు. వారి సామూహిక మనఃసంకల్పం బలమైనదిగా నుండును. అట్టి వారి ఆశీర్వాదం కూడా సూక్ష్మదశలో నున్న బాలల మనసుపై గొప్ప ప్రభావాన్ని కలిగించును.

బాల్యదశలో చేయు సంస్కారాలు ఎక్కువగా ఆరోగ్యాన్ని దృష్టిలో పెట్టుకొని యేర్పరచబడినవి. అందు తల్లిదండ్రులు ఏ యే జాగ్రత్తలు తీసుకొనవలెనో, శిశువును ఎటువంటి ఆహారంతో పోషించవలెనో, శిశువుపై పరిసరాల చెడు ప్రభావం పడకుండా ఏయే జాగ్రత్తలు తీసుకొనవలెనో ప్రబోధం చేయబడును.

ఉపనయన, వివాహాది సంస్కారాలలో మానవునిగా తాను ప్రయత్నించి పొందవలసినవి యేవో, సంఘంలో తానెట్లు మెలగవలెనో, గృహస్థునిగా తన కర్తవ్యమేమో మొదలగు విషయాలు వివరించ బడును. తప్పుదారిన పడకుండా అక్కడినుండి తన మార్గమేమిటో, ఆ మార్గంలో గల కష్టసుఖా లేమిటో, తీసుకోవలసిన జాగ్రత్త లేమిటో వివరించుట జరుగును. అందుచే ఆ వ్యక్తి తా నా మార్గాన నడుచుటకు వ్రతశీలుడై దీక్షను గైకొనును.

మహర్షి దయానందుడు రూపొందించిన 'సంస్కార విధి' సర్వోత్తమమైన వైజ్ఞానిక పద్ధతిని మనకు తెలుపును. వారు దీనిని క్రొత్తగా రూపొందించ లేదు. ప్రాచీన గృహ్యసూత్రాల ఆధారంతో వేదానికి అనుకూలంగా దీనిని రూపొందించిరి. కాలాంతరమున గృహ్యసూత్రాలలో కలిసిపోయిన ప్రక్షిప్తాలను తొలగించి వారు హేతుబద్ధమైన ఒక విధానాన్ని రూపొందించారు. దాని ననుసరించి సంస్కారాలు జరుపుకొనిన పదిహేను, ఇరువది సంవత్సరాల కాలంలో సర్వోత్తమ మానవజాతిని నిర్మించవచ్చును. నేడుకూడా ప్రపంచ మేధావులు ప్రజల మనఃప్రవృత్తిని చూచి యెంతో విచారించుచున్నారు. ఇది ఇట్లే కొనసాగినట్లయితే ముందు ముందు మరెంతగానో దిగజారిపోయి మానవులు రాక్షసులుగా మారిపోవుదురని ఆందోళన చెందుచున్నారు. దుర్వ్యసనాలలో తగుల్కొని అనారోగ్యవంతులై రోగులు, దుర్బలురు అయిన సంతానాన్ని కని దుర్బలజాతిని, నికృష్టమైనజాతిని నిర్మింతురని వారి ఆందోళన. స్వస్థజాతి నిర్మాణానికి వారెన్నో సూచనలను, ప్రణాళికలను రూపొందించుచున్నారు. కాని, మహర్షి దయానందుడు రూపొందించిన ఈ ప్రణాళికముందు అవియన్నియు కళావిహీనములే యగును.

ఉత్తమ మానవ జాతి నిర్మాణం కొరకు ప్రాచీన ఋషి ప్రణాళికలలో అట్టి ప్రయత్నం ఒకటి రెండుసార్లు కాక పదహారుసార్లు చేయవలసి యుండును. అవి కేవలం భౌతిక ప్రయోజనంకొరకేగాక శారీరక, మానసిక, ఆత్మికోన్నతులకొరకు చేయు ప్రయత్నాలు. అవి మానవుని యింద్రియ దాసునిగాకాక యింద్రియాధిపతిగా, దివ్యమానవునిగా వసుధైకకుటుంబ జీవనునిగా మార్చగలవు. అంతేగాక, అవి మానవుని విశ్వదేవతగా జేయగలవు. వాటిని గురించి ముందు ముందు వివరంగా తెలిసికొందము.

## గర్భాధాన సంస్కారం

షోడశ సంస్కారాలలో మొదటిది మఱియు ప్రధానమైనది గర్భాధాన సంస్కారం. **'గర్భస్యాధానం, వీర్యస్థాపనం, స్థిరీకరణం యస్మిన్యేన వా కర్మణా తద్ గర్భాధానమ్'** అనగా యే కర్మవలన వీర్య స్థాపనము, వీర్యమును గర్భాశయమున స్థిరపరచుట యనునది జరుగునో దానిని గర్భాధాన మందురు.

ఉత్తమ మానవజాతి నిర్మాణానికి ఉత్తమ సంతానోత్పత్తి ఆధారమగును. ఈ సంస్కారంయొక్క ఆశయం బలవీర్యాలు, శారీరక, మానసిక ఆరోగ్యాలు కలిగిన సంతానము నుత్పన్నము చేయుట. మంచి పంటలు పండవలెననిన ఉత్తమమైన క్షేత్రము నెన్నుకొని మంచిరకపు విత్తనాలు నాటుట ప్రథమ కర్తవ్యం. ఆ తరువాతనే మిగిలిన జాగ్రత్త లుపయోగపడును. అట్లే, ఉత్తమ సంతానమునకు ఉత్తమ స్త్రీ పురుషుల కలయిక అవసరం. దోషరహితమైన రజో వీర్యాల వలననే ఉత్తమ సంతానం కలుగును. స్త్రీ పురుషులు యౌవనావస్థను పొందిన తరువాతనే ఉత్తమ సంతానోత్పత్తి సామర్థ్యాన్ని కలిగియుందురు. సుశ్రుతాచార్యుడు తన వైద్యశాస్త్రము నందు సూత్ర స్థానంలో ఈ విధంగా చెప్పియున్నాడు.

**శ్లో॥ పంచవింశే తతో వర్షే పుమా న్నారీ తు షోడశే।**

**సమత్వాగత వీర్యౌ తౌ జానీయాత్ కుశలో భిషక్ ॥**

ఇరువదియైదు సంవత్సరాలు పురుషునకు, పదహారు సంవత్సరాలు స్త్రీకి వచ్చినప్పుడే స్వస్థ సంతానం కలుగు యోగ్యత లభించును. 25వ సంవత్సరాన ఎంత సామర్థ్యం పురుషుని శరీరమందుండునో అంతటి సామర్థ్యమే పదునారవ సంవత్సరాన కన్య శరీరమందుడును. కావున ఆ యా వయసులలో స్త్రీ పురుషు లిరువురును సమవీర్యవంతులు – అనగా సమానమైన సామర్థ్యమును కలిగి యుందురని గ్రహించవలెను. నేటి విజ్ఞానంకూడా ఈ విషయము నంగీకరించును. స్త్రీ రజస్వల అయిన తరువాత .రెండు మూడు సంవత్సరాలకుకాని గర్భాశయం పెరిగి బలపడి గర్భధారణ సామర్థ్యమును పొందదని చెప్పుదురు. పురుషుల యందు పదహారవ సంవత్సంంలో వీర్యోత్పత్తి ప్రారంభమైనను 25వ సంవత్సరంవఱకుగాని బలమైన వీర్యాణువుల నుత్పత్తి చేయజాలదని చెప్పుదురు. ఇది కనీస వయస్సు. ప్రాచీన శాస్త్రాలలో యౌవనము అప్పటినుండి క్రమంగా వికసించుచు స్త్రీకి 25 సంవత్సరములు వచ్చునాటికి, పురుషులకు 48 సంవత్సరాలు వచ్చునాటికి పూర్ణత్వం చెందునని చెప్పబడింది. ఈ పద్ధతి సగటు ఆయుర్ధాయం 100 సంవత్సరాలైనప్పుడు జరుగును. ఇప్పటి పరిస్థితులను బట్టి కొంత తక్కువగా తీసుకొనవలసి యుండును.

ప్రాచీన కాలంలో బాలబాలికలను వేరు వేరు గురుకులాలలో - దూరదూరంగా నుండువానిలో ఎనిమిది సంవత్సరాల ప్రాయంలోనే చేర్పించెడివారు. ఆ గురుకులాలు చాలా నియమాలు కలిగి యుండెడివి. బ్రహ్మచర్యాన్ని ఒక వ్రతంగా స్వీకరించి ఆ కాలంలో ఆ నియమాల నన్నింటిని పాటించి విద్యాభ్యాసం చేసెడివారు. ఆ నియమాలన్నీ శరీరాన్ని బలపరచుటకే. బాలుర గురుకులాలలో పురుషులే అధ్యాపకులుగా ; బాలికల గురుకులాలలో స్త్రీలే అధ్యాపికలుగా నుండెడివారు. బాలబాలికల మనస్సంతా విద్యాభ్యాసం పైననే కేంద్రీకృతమై యుండెడిది. కామసంబంధ ప్రసంగాలకు దూరంగా నుండెడివారు. రజోవీర్యాల విలువను వారికి బోధించెడివారు. అందుచేత ఆ బాలబాలికలు యువావస్థను బొంది విద్యావంతు లగుటతోబాటు బలారోగ్యాలను కూడా పొందెడివారు. పరస్పర గుణకర్మలు ఒకటిగా నుండెడు స్త్రీ పురుషులు తమ యిష్టంతో వివాహం చేసుకొనెడివారు. అట్టి వివాహిత స్త్రీ పురుషులు గర్భధారణ చేయునప్పుడు వారిని అందుకు తగినట్లుగా వ్యవహరించుటకు ఈ సంస్కారం ఉద్దేశించబడింది.

ఉత్తమ సంతానమునకు బలారోగ్యాలతో బాటు మానసిక ప్రసన్నత చాలా అవసరం. స్త్రీ శరీరంలోని గర్భధారణను వ్యతిరేకించు దోషాలను పోగొట్టుటకు ఒక ప్రత్యేక హోమం చేసెడివారు. మానసిక ప్రసన్నత కొఱకు ప్రోత్సహించెడివారు. దానికితోడు పెద్దల ఆశీర్వాద బలంకూడా ఒక సమ్మోహన (హిప్నోటిక్) శక్తిగా పనిచేసి వారికి మానసిక స్థైర్యము నిచ్చెడిది. మనం పూర్వ ప్రకరణాలలో మానవ శరీరనిర్మాణమును గూర్చి కొంత చెప్పుకొంటిమి. కణములలో నుండు క్రోమోజోములు మానవుల స్వభావము ననుసరించియే యుండును. గర్భధారణ సమయములో స్త్రీ పురుషులెట్టి భావనలను కలిగియుందురో అట్టి ప్రభావమే వారి రజోవీర్యాలపై నుండును. స్త్రీయొక్క అండము, పురుషుని యొక్క వీర్యకణాలపై ఆ భావనల ప్రభావ ముండుటచేత స్త్రీ పురుషులు మానసికంగా ప్రసన్నులై యుండుట అవసరం.

చరిత్రలో ఈ విషయాన్ని స్పష్టపరచు నొక సంఘటన కలదు. మహాభారతంలో పాండురాజు, ధృతరాష్ట్ర, విదురుల జన్మ వృత్తాంతాల గుఱించి యిట్లు వ్రాయబడినది-వేదవ్యాసుడు నియోగం ద్వారా అంబిక యందు

గర్భధారణ చేయునపుడు ఆమె భయంతో కంపించెననియు, పరిణామంగా పాండురోగంతోకూడిన పాండురాజు ఉద్భవించె ననియు; అంబాలిక భయంతో కన్నులు మూసికొనుట వలన పుట్టు గ్రుడ్డియైన ధృతరాష్ట్రుడు జన్మించెననియు, దాసి యందు గర్భధారణ చేయునపుడు ఆమె తనకు ఉత్తమ సంతానం కలుగుననెడు ఆనందంతో ప్రసన్నంగా నుండుటవలన జ్ఞానియైన విదురుడు కలిగెననియు వ్రాయబడినది. దీనిని బట్టి గర్భధారణ సమయంలో స్త్రీ పురుషుల మానసిక ప్రసన్నత యెంత అవసరమో తెలియుచున్నది.

ఉత్తమ మానవజాతి నిర్మాణం కొరకు ఆలోచనలు సాగించిన ప్రపంచ మేధావులు చాలామంది గలరు. వారి ఆలోచనలను బట్టి వారిని స్థూలంగా రెండు వర్గాలుగా విభజించవచ్చును. అందు మొదటివారు వంశాను క్రమవాదులు. వీరు సంతానం రజోవీర్యాల కలయిక వలన ఏర్పడునది గాన వాటిలో నుండు జీన్స్‌యొక్క ప్రభావం వలన అట్టి వంశానుగత లక్షణాలుగల పిల్లలు మాత్రమే పుట్టి పెరుగుదురుకాని, ఎంత ప్రయత్నించినను జీన్స్‌లో మార్పు తీసుకొని రాలేమని వాదించెదరు. ఇది నిరాశావాదంగా నున్నను దీనికి కొన్ని ఆధారాలున్నవి. రెండవ కోవకు చెందినవారు ఉత్తమ సంతానమునకు పరిసరాల ప్రభావమే ఎక్కువగా పనిచేయునని వాదించెదరు. వీరిది అత్యాశావాదంగా గన్పించినను వీరికిని కొన్ని ఆధారాలు గలవు. భారతీయ ఋషు లేర్పరచిన షోడశ సంస్కారాలు ఈ రెండింటిని కొంతవరకు ఆమోదించును. ఈ రెండింటియొక్క సమన్వయం సంస్కార ప్రణాళికలో మేళవించబడినది. అందుచేత సంస్కారాలను రెండుగా విభజించిరి. అందు మొదటివి గర్భస్థ Pre-natal సంస్కారాలు. గర్భాధాన, పుంసవన, సీమంతోన్నయన సంస్కారాలు ఈ వర్గంలో చేరును. ఇవి స్త్రీగర్భంలో శిశువు నిర్మాణం జరుగుచున్నప్పుడు చేయబడును. మిగిలిన వన్నియు అనగా జాతకర్మ నామకరణాది సంస్కారాలన్నియు శిశువు జన్మించిన తరువాత చేయబడునవి. వీటిని జన్మానంతర (పోస్ట్ నేటల్) సంస్కారాలందురు.

ప్రాచీన ఋషులు పై రెండు వాదనలను సమన్వయ పరచినట్లు అర్థమగుచున్నది. ఈ రెండువాదాల గుఱించి, వాటి పరిశోధనలను గుఱించి కొంత వివరంగా తెలిసికొనుట అవసరం.

## వంశానుక్రమ వాదం

ఈ విషయంలో పరిశోధించిన ఆధునిక శాస్త్రవేత్తలలో డా॥ గాల్టన్ (1822-1911) మొదటివారు. వీరి మతానుసారం తల్లిదండ్రుల శారీరక, మానసిక గుణాలను తెచ్చు ఒక తత్త్వం రజోవీర్యాలలో కలదు. దీనికి వారు "జరమ్ప్లాజమ్" అని పేరుపెట్టిరి. ఈ తత్త్వమును 'మరణ మెరుగని చిరంజీవి' యని వారు చెప్పుదురు. ఇది తాత ముత్తాతలలో నుండు శారీరక, మానసిక గుణాలను పిల్లలలో తీసుకొనివచ్చుచున్నది. ముందు తరతరాలకు అందించుచున్నది. అందుచేతనే కొంతమంది పిల్లలు తండ్రి పోలికలుగాక తాత ముత్తాతల పోలికలు కలిగియుందురు. ఒక పిల్లవానిలో తల్లిదండ్రులలో లేని ఏవైన గుణాలు కనపడిన అవి వారి వంశంలో ఎవరియందో ఉండి యుండవలెను. వంశంలో లేని గుణాలు మాత్రం ఏర్పడవు. ఇది వీరి మతం.

ఈ విషయంలో పరిశోధించిన రెండవ శాస్త్రవేత్త విజ్మాన్ (1834-1914). వీరు గాల్టన్ సిద్ధాంతమును మరికొంత వివరించియున్నారు. మన శరీరంలో రెండు రకముల కణము లుండును. అందు మొదటివి సోమాటిక్ సెల్స్ (Somatic Cells). ఇవి శరీరంలోని వివిధ అవయవాల నిర్మాణంలో తోడ్పడునవి. రెండవవి "జనరేటివ్ సెల్స్" (Genarative Cells) ఇవి పురుషుని వీర్యంలోను, స్త్రీయొక్క అండంలోను ఉండును. ఇవి ప్రవాహ రూపమున నిరంతరం జీవించుచుండును. వీటిలో శరీర రూపురేఖలను శాసించు జీన్సు ఉండును. పెద్దలు మరణించినను ఈ కణములు వారి సంతానంలో జీవించియుండును. దీనికే వారు "కంటిన్యూటీ ఆఫ్ జరమ్ ప్లాజమ్" (Continuty of Geram Plasam)' అని పేరు పెట్టిరి. వీటిని మార్చుట అసాధ్యమని వీరి యభిప్రాయం. దీనిని నిరూపించుటకు వారు చేసిన కొన్ని ప్రయోగ ఫలితాలను వివరించి యుండిరి. ఉదాహరణకు:-

**జూక్ (Juke) వంశము** : క్రీ.శ. 1720 న్యూయార్క్ నగరమున జూక్ అను వ్యక్తి పుట్టి పెరిగెను. అతని వంశం 1877 నాటికి 1200 మంది వ్యక్తులతో కూడినది అయ్యెను. వారిలో 440 మంది వ్యక్తులు ఏదో రోగంతో బాధపడిరి. 310 మంది భిక్షకులుగానైరి. 306 మంది జైళ్ళలో మరణించిరి. 130 మంది యేదో ఒక రకమైన హత్యాప్రయత్నం చేసిరి. అందు ఏడుగురు

హత్యలు కూడా చేసిరి. వారి వంశంలోని స్త్రీలందరు వేశ్యలైరి. క్రీ.శ. 1915వ సంవత్సరంలో మరల వీరి వంశమును పరిశోధించిరి. అప్పటి కా వంశంలో 2820 మంది వ్యక్తులుండిరి. వారిలో 500 మంది పిచ్చివారుగ నుండిరి. మిగిలిన వారందరు పై విధంగానే ఏదో ఒక అపరాధం చేసినవారే.

మార్టిన్ కాల్లీకాక్ వంశము : అమెరికా స్వాతంత్ర్యపోరాట సమయమున కాల్లీకాక్ అను వ్యక్తి అమెరికాలో పుట్టి పెరిగెను. అతనికి ఇద్దరు భార్యలుండిరి. అందులో ఒకరు మంచి వంశం నుండి వచ్చిన వారు. వివాహం కూడా న్యాయబద్ధంగా జరిగినది. వారికి పుట్టిన వారందరు మంచి ప్రవృత్తికలిగినవారై యుండిరి. రెండవ భార్య అక్రమ సంబంధంతో భార్యగా చేసుకొబడిన హీన వంశస్థురాలు. ఆమెకు కలిగిన సంతానంలో అందరూ హీనబుద్ధి కలవారైరి. ఒక్కరికి గూడా మంచి గుణాలు రాలేదు.

**జోనాథన్ అడ్వర్డ్స్ వంశము** : వీరి వంశం క్రీ.శ. 1900 సంవత్సరంలో పరిశోధించబడెను. అప్పటికి వారి వంశంలో 1394 మంది వ్యక్తులుండిరి. అందులో 295 మంది పట్టభద్రులు. కొంత మంది గొప్ప పనులు చేసినవారు, వ్యాపారస్థులు, వ్యవసాయదారులుగా నుండిరి. అందు 13 మంది కాలేజి ప్రొఫెసర్లును ఉండిరి. ఒకరు అమెరికా వైస్ ప్రెసిడెంట్ అయ్యెను. వారి వంశంలో ఏ ఒక్క వ్యక్తి కూడా ఏ చిన్న తప్పిదం చేసినవారు కనుపించలేదు.

ఇటువంటి కొన్ని పరిశోధనల ఫలితంగా గాల్టన్ మరియు విజ్‌మాన్‌లు 'సంతానంపై వంశానుక్రమ ప్రభావమే' బలమైనదిగా నుండునని యొక నిర్ణయమునకు వచ్చిరి. దీనిని బట్టి మన సంస్కారాలు నిరుపయోగ మనిపించును. కాని, ఈ శాస్త్రవేత్తలు పొరబడినారని చెప్పవచ్చును. వారు పరిశోధించిన వంశాలలో ఆ సంతానం పెరిగిన వాతావరణం కూడా అట్టిదే అయి యుండవచ్చును. వంశానుక్రమంగా రూపురేఖలు అవశ్యంగావచ్చును. వాటిని మార్చుట అసాధ్యమేకాని, మానసికంగా వారిలో మార్పు తీసుకొని రావచ్చును. కొన్ని జాగ్రత్తల వలన, కొన్ని ఔషధాల వలన వంశానుక్రమంగా వచ్చు దీర్ఘ వ్యాధులనుకూడా నివారణ చేయవచ్చును. నేటి సమాజంలోను మనము ఎన్నో వంశాలను చూచుచున్నాము. తరతరాలుగా అవిద్వాంసులైన వంశాలలోని పిల్లలకు చదువుకొను అవకాశాలు కల్పించుటవలన విద్యావంతు

లగుచున్నారు. దురలవాట్లు కలిగిన వంశంలో పుట్టిన పిల్లలు మంచి పరిసరాలలో పెరుగుటవలన గుణవంతులగుచున్నారు. సదాచార సంపన్నులైనవారి వంశంలో పుట్టినవారైనను పరిసర ప్రభావం వలన, చెడు సాంగత్యం వలన దురలవాట్లకులోనై హీనబుద్ధికలవా రగుటయు చూచుచున్నాము. కనుక, ఈ సిద్ధాంతాన్ని పూర్తిగా అంగీకరించరాదు.

నేడు వైజ్ఞానికులు ఉత్తమ మానవజాతి నిర్మాణంకొఱకు కొన్ని వైజ్ఞానిక పద్ధతుల ననుసరించుచున్నారు. నేడు జన్యు విజ్ఞానం ఎంతగానో అభివృద్ధి చెందినది. జీన్స్‌లో మార్పులు తెచ్చుటకు ఎన్నో ప్రయత్నాలు జరుగుచున్నవి. అమెరికా, రష్యా మొదలగు దేశాలలో మాలిక్యులర్ బయాలజీ, జీవవిజ్ఞానం ఎంతగానో ప్రగతిని సాధించినది. వారు ప్రయోగాలుచేసి బలమైన, ఎక్కువ ఉత్పాదక శక్తిగల జంతు సంతతిని తయారు చేయుచున్నారు. ఆవులు, గొఱ్ఱెలు మొదలగు పశుజాతులను, ఎన్నో రకాల వృక్షజాతులను నిర్మించు చున్నారు. వారి పరిశోధనలు మనుష్యులలో కూడా మార్పు తీసుకొనివచ్చుటకు పురోగమించుచున్నవి. దీనికి వారు జెనెటిక్ హ్యూమన్ ఇంజనీరింగ్ (Genetic Human Engineering) అని పేరుపెట్టిరి.

హార్వర్డ్ విశ్వవిద్యాలయ వైజ్ఞానికులు కొలదికాలములోనే గొప్పమానవుని (సూపర్ మాన్‌ని) నిర్మించగలమని చెప్పుచున్నారు. డా౹౹ ఎ. నిఫార్ సోవియట్ అకాడమీ ఆఫ్ సైన్సెస్ (Soviet Academy of Sciences) గారి అధ్యక్షతన హ్యూమన్ సైన్సెస్ ఆఫ్ ఇంజనీరింగ్ (Human Sciences of Engineering) విభాగమును నెలకొల్పి ప్రయోగాలు చేయుచున్నారు. కొలది కాలంలోనే మనం కోరిన వైజ్ఞానికులను, దార్శనికులను, కళాకారులను, న్యూటన్ ఐన్‌స్టీన్ మొదలగువారివంటి మేధావులను నిర్మించవచ్చునని డా౹౹ నెఫార్ నమ్ముచున్నారు. వీరి ప్రయోగాలలో మానవ ఉత్పాదక కోశాలైన రజో వీర్యాణువులలోని న్యూక్లియస్‌ను తొలగించి వాటి స్థానంలో మనం కోరిన మేధావంతుల ఉత్పాదక కోశంలోని జీవాణువులను జొప్పించి స్త్రీగర్భంలో ప్రవేశపెట్టుట వలన దీనిని సాధించవచ్చునని తేలినది. పది సంవత్సరాల క్రితం అమెరికా నివాసియైన భారతీయ వైజ్ఞానికుడు డా౹౹ హరగోవింద ఖురానా గారు మాన్‌చెస్టర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ (Dr. Haragovinda Khuraana, Manchestar Institute of Tech-

nology) అను సంస్థలో జీవ విజ్ఞాన విభాగంలో ప్రయోగాలు జరిపి కృత్రిమ పద్ధతులలో ఒక జీన్‌ను ఉత్పత్తి చేసిరి. దీని ఆధారంతో మరి కొంత కాలానికి దోషరహిత జీన్స్‌ను ఉత్పన్నం చేసి గొప్ప మానవుని అంటే దోష రహిత మానవుని నిర్మించవచ్చునని కలలు కంటున్నారు.

క్రీ.శ. 1980 అమెరికా దేశంలో ప్రపంచ వైజ్ఞానికులను ఆశ్చర్య చకితులను చేసిన ఒక ప్రయోగం జరిగినది. (Animal Cloning) ఏనిమల్ క్లోనింగ్' అనెడు ప్రక్రియతో కొన్ని ఆడ కప్పలలోని అండంలోని న్యూక్లియస్‌ను పూర్తిగా తొలగించి మరియొక ఆరోగ్యవంతమైన న్యూక్లియస్‌ను జొప్పించి ఆరోగ్యవంతమైన కప్పలను పుట్టించిరి. అంతేగాక, ఒక ఆడ కప్పయొక్క ఓవమ్ (Ovam) నుండి న్యూక్లియస్‌ను Litral Ultra Violet Radiation ద్వారా కాల్చివేసి మరియొక కప్ప చిన్నప్రేగులలోని యొక జీవకణమును తీసికొని అందలి న్యూక్లియస్‌ను స్వీకరించి దానిని ఖాళీచేసి ఆడకప్ప ఓవమ్‌లోనికి ప్రవేశింపజేసి దావిగర్భంలో అండమును ప్రవేశపెట్టిరి. దానితో నొక మంచి కప్ప పుట్టినది. దాని రూపురేఖలన్నియు ఏ కప్ప ప్రేగుల నుండి జీవకణములు సేకరింపబడినవో అట్టి డోనర్‌కప్ప రూపు రేఖలే కలిగియున్నది. అది వీర్యకణము కాదు. ప్రేగులలోని యొక పూర్తి కణము. అందుచే పూర్తిగా డోనర్‌కప్ప వంశానుక్రమ లక్షణాలే వచ్చినవి. దీనినిబట్టి సంతానోత్పత్తికి వీర్యకణం అవసరం కన్న అండమే ముఖ్యపాత్ర వహించునని అర్థమగుచున్నది. అండంలోని నూక్లియస్‌ను మన కనుకూలమైన విధంగా మార్చుకొనిన మన మాశించిన సంతానమును పొందవచ్చును. ఏ వ్యక్తి నూక్లియస్‌ను మనం అండంలో ప్రవేశ పెట్టెదమో ఆ వ్యక్తియొక్క కార్బన్‌కాపీగా బిడ్డ పుట్టగలదు.

ప్రఖ్యాత సైన్స్ గ్రంథాల రచయిత డేవిడ్ రోర్విక్ 1978వ సంవత్సరంలో వ్రాసిన 'ఇన్ హిస్ ఇమేజ్' అను వాస్తవిక సంఘటనా గ్రంథం ప్రపంచ మేధావులను ఆశ్చర్య చకితులను చేసింది. వా రా గ్రంథంలో పైన వివరించిన పద్ధతిలో కలిగిన ఒక క్లోనింగ్ బిడ్డయొక్క జన్మవృత్తాంతం వివరించిరి. 1973 సెప్టెంబర్ నెలలో 67 సంవత్సరాల వయస్సుగల ఒక కోటీశ్వరుడు ఈ రచయితను కలుసుకొని తనకు క్లోనింగ్ పద్ధతిలో ఒక బిడ్డ కావలెననియు, దాని కెంత వ్యయమయినను భరించెదననియు, సైంటిస్టులను వెదకుట,

ప్రయోగాలు సమీక్షించుట నీ బాధ్యతయనియు కోరెనట. ఈ ప్రయోగం ఆచరణ సాధ్యమా? ధార్మిక దృష్టితో ఆచరించవచ్చునా? లేదా? అని చాలా ఆలోచించి ప్రయోగం చేయుటకే నిర్ణయించుకొని అందుకు తగిన శాస్త్రవేత్తలను, ప్రయోగశాలను ఏర్పరచెను. వారి గ్రంథంలో సైంటిస్ట్ యొక్క పేరు 'డార్విన్' గాను, బిడ్డను కోరు కోటీశ్వరుని పేరు 'మాక్స్'గాను, ప్రయోగాలు నిర్వహించిన స్త్రీ పేరు 'స్పారో'గాను పేర్కొనిరి. అసలు పేర్లు కొన్ని కారణాలవలన రహస్యంగా నుంచిరి. వీరు ఒక పెద్ద ఆటవిక ప్రాంతాన్ని ఎన్నుకొని ఒక ప్రసూతి వైద్యశాలను, సంతాన నిరోధక శస్త్ర చికిత్సా విభాగాన్ని నెలకొల్పి అక్కడి ప్రజలకు సేవచేస్తూ సంతాన నిరోధ ఆపరేషన్ చేయబోవు స్త్రీలకు ముందుగా కొన్ని హార్మోనులిచ్చి పక్వము చెందిన అండాలను సేకరించి తరువాత సంతాన నిరోధక శస్త్ర చికిత్సను చేసెడివారు. ఆ అండాలతో వారు ప్రయోగాలు చేసి చివరకు అండంలోని న్యూక్లియస్‌ను తొలగించి మరియొక న్యూక్లియస్‌ను చొప్పించుటలో సఫలీకృతులైనారు.

విజ్ఞానవేత్తలు ఎక్కువ ధనాశను చూపించి ఒక పదిహేడు సంవత్సరాల కన్యను సంతానం కని ఇచ్చుటకు ఒప్పించిరి. ఆమె అండమును సేకరించి దానిలోని న్యూక్లియస్‌ను పూర్తిగా తొలగించి కోటీశ్వరుని శరీరంలోని ఒక పూర్తికణము యొక్క న్యూక్లియస్‌ను చొప్పించి ఆమె గర్భంలో ప్రవేశపెట్టిరి. ఆమె గర్భిణిగా నున్నప్పుడే లోపల పెరుగుచున్న బిడ్డయొక్క ఆరోగ్యమును, ఆ బిడ్డ యందుగల కోటీశ్వరుని పోలికలను గుర్తించి సంతృప్తి చెందిరి. తొమ్మిది నెలల అనంతరం 1976 డిశంబర్‌లో ఒక సౌత్ ఆఫ్రికా డాక్టరు క్రొత్తగా రూపొందించిన పరికరంతో ప్రసవబాధ ఎక్కువగా కలుగుకుండ ప్రసూతిని చేసిరి. ఒక చక్కటి బిడ్డ కలిగెను. ఆ బిడ్డ ఒక సంవత్సరం ఆరోగ్యంగా పెరిగిన తదుపరి మరల కోటీశ్వరుని పోలికలు బిడ్డలో ఎంతవరకు వచ్చినవో పరిశోధనలు జరిపిరి. ఆ బిడ్డ యందు పూర్తిగా కోటీశ్వరుని లక్షణాలే కనుగొని సంతృప్తి చెంది ఆ గ్రంథమును వ్రాసినట్లుగా రచయిత రోర్విక్ పేర్కొనిరి. వారి మాటలు నమ్మతగ్గవని ప్రపంచ శాస్త్రవేత్తలందరు అంగీకరించిరి. కనుక వంశానుక్రమవాదమును బలమైనదే.

## పరిసర (Environmental) ప్రభావ వాదం

వీరి పరిశోధనలలో ఒకే తల్లిదండ్రులకు పుట్టిన బిడ్డలను వేరు వేరు పరిసరాలలో (ఆశ్రమ పాఠశాలలలో) పెంచుట వలన వేరువేరు గుణాలు వారికి కలిగినట్లు తేలెను. మఱి కొంతమంది వేరువేరు తల్లిదండ్రులకు పుట్టిన పిల్లలను ఒకే ఆశ్రమ పాఠశాలలో పెంచగా వారి గుణగణాలలో ఏయే మార్పులు కలిగినవో కూడా పరీక్షించిరి. అట్లే కవల పిల్లలపైన కూడా పరిశోధనలు జరిపిరి. దీనికి వారు 'కంట్రోల్డ్ ఎక్స్‌పరిమెంట్స్' అని పేరు పెట్టిరి. ఆ ఫలితము లీవిధముగా నున్నవి.

**ఒకే పరిసరాలలో పెరిగిన కవలపిల్లలు (ట్విన్స్ ఇన్ ఐడెంటికల్ ఎన్విరాన్‌మెంట్)** కవల పిల్లలు రెండు రకాలుగా నుందరు. స్త్రీలలో ప్రతి నెల కుడి లేదా యెడమవైపు అండకోశం నుండి ఒకే అండం విడుదల యగుచుండును. సాధారణంగా ఒక నెల ఒకవైపునుండి మరియొక నెల ఇంకొకవైపు అండకోశంనుండి అండములు విడుదల యగుచుండును. అరుదుగా ఒకేసారి రెండు అండములు విడుదల యగును. ఆ సమయంలో వీర్యసంపర్కం జరిగినచో ఆ రెండు అండముల వలన కవల పిల్లలు పుట్టుదురు. మూడు అండములైన ముగ్గురు పుట్టుదురు. ఇటువంటి పిల్లలను 'డై జైగోట్స్' అందురు. వీరిలో నొకరు ఆడ మరియొకరు మగ కావచ్చును. మరియొక రకమైన కవల పిల్లలుందురు. వీరు తల్లియొక్క ఒకే అండము నుండి పుట్టినవారు. తల్లి నుండి ఒకే యండము విడుదలైనప్పటికీ వీర్య సంపర్కము జరిగిన తర్వాత కొన్ని అరుదైన పరిస్థితులలో రెండు లేక ఎక్కువగా విభజించబడి ప్రత్యేక అండములుగా తయారై క్రమంగా శిశువులుగా పెరుగును. ఇట్టి వాటిని "మోనో జైగోట్స్" అందురు.

మనోవిజ్ఞాన శాస్త్రాలలో ఒక ప్రసిద్ధమైన వాస్తవిక కథ పేర్కొనబడినది. ఈ కథ పేరు "ద ఫైవ్ సిస్టర్స్" (అయిదుగురు అక్క చెల్లెండ్రు). దీని రచయిత విలియమ్ ఇబ్లెడ్ (1938). వారు ఆ పుస్తకంలో మోనో జైగోట్స్ నుండి పుట్టిన అయిదుగురు అక్కచెల్లెండ్ర సామాజిక వికాసము నధ్యయనము చేసి వ్రాసిరి. ఒకే అండము ఒకే వీర్యాణువుతో కలిసినతర్వాత కొన్ని పరిస్థితుల ప్రభావం వలన అయిదుగా విభజించబడి వేరువేరు పిండములుగా తల్లి గర్భంలో

పెరిగి ప్రసవింప బడుటచే ఆ అయిదుగురిలోనూ ఒకే రకమైన క్రోమోజోములు మరియు జీన్స్ ఉండవలెను. వారి మనోవికాసం కూడా ఒకటిగా నుండవలెను. వారి రూపురేఖలు , శరీర అవయవ నిర్మాణము ఒకటిగా నుండవలెను. రూపురేఖలలో ఒకే పోలిక లున్నవికాని మానసిక వికాసంలో, భావాలలో చాలా మార్పులు కనబడినవి. ఈ పిల్లలు డయోనీ వంశంలో పుట్టినవారు. వీరు మూడు సంవత్సరాల వయస్సులో నుండగా మనోవిజ్ఞాన వేత్తలు వీరిలోని మనోవికాసమును పరీక్షించగా ఈ క్రింది విషయాలు వెల్లడియైనవి.

| పేరు | సోషల్ సక్సెస్ | సోషల్ పాపులారిటీ | సోషల్ ఇంట్రెస్ట్ |
|---|---|---|---|
| ఎనేట్ | 130% | 80% | 270% |
| సేసిల్ | 120% | 120% | 180% |
| ఎమిలి | 90% | 100% | 60% |
| మేరీ | 90% | 70% | 40% |
| యూనీ | 180% | 160% | 100% |

పై పరీక్షలో ఆ వయస్సులో సామాన్యంగా నుండ వలసిన వికాసమును వందగా తీసికొని వారి వికాసములను లెక్కించిరి. వారిలో సోషల్ సక్సెస్ – సామాజిక సాఫల్యతలో ఎమిలి మరియు మేరీలకు 60 అంకములు (మార్కులు) రాగా, యూనీకి రెట్టింపు గుణములు (180) మార్కులు వచ్చినవి. సామాజిక ప్రియత – సోషల్ పాపులారిటీలో యేనట్, మేరీలకు తక్కువ మార్కులు రాగా యూనీకి రెట్టింపు మార్కులు వచ్చినవి. సామాజిక అభిరుచిలో మేరీకి కేవలం 40 మార్కులు రాగా యేనట్‌కు అత్యధికముగా 270 మార్కులు వచ్చినవి.

ఈ అక్క చెల్లెంద్ర స్వభావమును మనోవిజ్ఞానవేత్తలు జాగ్రత్తగా అధ్యయనం చేసిరి. వారిలో ఎమిలీ అత్యంత శాంతస్వభావురాలు కాగా ఏనట్, మేరీలు అత్యంతకోప స్వభావము కలిగి యుండిరి. ఎమిలీ చాలా ధైర్యస్థురాలుగా నుండెను. అంతేకాక, ఇతర అక్కచెల్లెంద్రపట్ల యేవిధమైన రాగ ద్వేషాలులేని యొక ప్రత్యేక వ్యక్తిత్వం కలిగియుండెను. అందుచే మనోవిజ్ఞానవేత్తలు ఈమెను ఆత్మస్థైర్యంగల స్వతంత్ర వ్యక్తిత్వంగల కన్యయని పేరు పెట్టిరి. వీరందరిలో మేరీ చాలా బుద్ధిమాంద్యం కలిగినది. యూనీ పెద్ద మనిషిగా ప్రవర్తించెడిది. వీరందరు కూడా ఒకే పరిసరాలో పెంచబడినవారు. ఒకే అండము నుండి పుట్టినవారు. అయినప్పటికి వీరిలో పై భేదములు కలుగుటకు కారణమేమో

వంశానుక్రమ వాదులు కానీ, పరిసరప్రభావ వాదులు కానీ సమాధానం చెప్పలేరు. దీనికి భారతీయ వేద శాస్త్రములే చక్కని సమాధానం చెప్పును. తల్లిదండ్రులనుండి, పరిసరాల నుండి పొందిన సంస్కారాలేగాక పూర్వజన్మలనుండి జీవుడు తెచ్చుకొను సంస్కారాల ప్రభావమే పై హెచ్చు తగ్గులకు కారణమని గట్టిగా చెప్పవచ్చును.

## వేరు వేరు పరిసరాలలో పెరిగిన కవల పిల్లలు

(ట్విన్స్ ఇన్ డిఫరెంట్ ఎన్విరాన్‌మెంట్స్)

జీవవిజ్ఞానవేత్త అయిన 'న్యూమైన్', మనోవిజ్ఞానవేత్త అయిన 'ఫ్రీమైన్' మరియు గణితశాస్త్రవేత్త అయిన 'హొలజింగర్' 19 మంది కవల పిల్లలపై పరిశోధనలు గావించిరి. వీరి మానసిక యోగ్యత చాలా వరకు సమానంగా నుండెను. కాని, అందు ఐదుగురు చాలా భిన్నమైన పరిసరాలలో పెంచబడుటవలన వారి మానసిక స్థితిలో కొంతభేదం కనబడినది. దీనినిబట్టి వంశానుక్రమం మానసిక వికాసంపై తన ప్రభావం చూపుచున్నదని తెలియుచున్నది. విశేష ప్రయత్నంతో కొద్ది మార్పు తీసికొనిరాగల మను ఆశకూడా కనబడుచున్నదని వారు నిర్ణయించిరి.

<u>విభిన్న వంశాలలో పుట్టిన పిల్లలు ఒకే పరిసరాలో పెరుగుట: (చిల్డ్రన్ ఆఫ్ డిఫరెంట్ హెరిడిటీ ఇన్ ఐడెంటికల్ ఎన్విరాన్‌మెంట్) :</u>

ఈ పరీక్షలకు శిశు సంరక్షణా కేంద్రము లెన్నుకొనబడెను. మిస్. బి.యస్. బర్కస్ అను శాస్త్రవేత్త కొన్ని పరీక్షలు జరిపెను. మరి కొన్ని ఎఫ్.యన్.ఫ్రీమైన్ జరిపెను.

<u>మిస్. బర్క్స్ పరిశోధనలు :</u> వీరి పరిశోధనలలో వంశానుక్రమ ప్రభావం 80% ఉండగా, పరిసర ప్రభావం 12.20% వరకు ఉన్నట్లు పేర్కొనిరి. ఈ వాతావరణంలో పెంచుట వలన విద్యావంతుల బిడ్డలు ఎక్కువలో ఎక్కువ 20 మార్కులు ఎక్కువ పొందగా అవిద్యావంతుల బిడ్డలు తక్కువలో తక్కువ 20 గుణములు తక్కువ పొందిరి. పరిసరాల ప్రభావం ఇంతకు మించి కనబడ లేదు. అందుచే ఆమె వంశానుక్రమ ప్రభావమే బలమైనదని చెప్పియుండెను.

<u>ఫ్రీమైన్ పరిశోధనలు :</u> వీరు అయోవ విశ్వవిద్యాలయ శాస్త్రవేత్తలతో

కలిసి కొన్ని శిశుసంరక్షణా కేంద్రాలలో పరీక్షలు జరుపగా చాలా చిన్న వయసులో ఈ కేంద్రంలో చేర్చబడిన వారి బుద్ధివికాసము ఆలస్యముగా చేర్చిన బిడ్డల బుద్ధి వికాసంకన్న ఎక్కువగా కనబడినది. అంతేగాక, ఆ యా పోషక గృహాలు నడుపువారి యొక్క ప్రభావంపై కూడ ఈ వికాసం ఆధారపడి యున్నట్లు గుర్తించిరి.

అయోవ విశ్వవిద్యాలయ పక్షమున 150మంది అనాథ పిల్లలపై నొక పరిశోధన జరుపబడినది. వీరందరు ఆరవ నెలలోనే అనాథ శరణాలయంలో చేర్చబడిరి. వీరి బుద్ధివికాస నిర్ణయానికి వీరి తల్లిదండ్రుల బుద్ధివికాసం దృష్టిలో నుంచుకొని వేరు వేరు వయస్సులలో పరీక్షించిరి. వీరి పరిశోధనలో పరిసర ప్రభావమే ఎక్కువగా నున్నట్లు వెల్లడైనది. పై 150 మందిలో 16 మంది అవిద్యావంతులైనవారి బిడ్డలు. వారి పిల్లలను ఈ శరణాలయంలో చేర్చినపుడు 71% I.Q ఉండగా రెండు సంవత్సరరాలోనే వారి బుద్ధి బలం 116% I.Q కు పెరిగినది. అందుచే వీరు తల్లిదండ్రులనుండి వచ్చు వంశానుక్రమబలం ఎంత అధికంగా నున్నను పరిసర ప్రభావం తప్పక మార్పులు తెచ్చునని ప్రకటించిరి.

**వంశానుక్రమ, పరిసర ప్రభావ వాదముల సమన్వయం :**

పై శాస్త్రవేత్తల ప్రయోగ ఫలితాలనుబట్టి సామాజిక శాస్త్రవేత్తలు ఒక నిర్ణయానికి వచ్చిరి. "తల్లిదండ్రులనుండి జీన్స్‌ద్వారా వచ్చిన వంశపారంపర్య లక్షణాలు ప్రబలమైనవి. రంగు, రూపురేఖలు మార్చుట అసాధ్యమే. కాని, పెరిగిన పరిసరాల ప్రభావం, ప్రయత్న పూర్వకంగా మనం వేసిన సంస్కారాలు మానసిక వికాసంపై తమ ప్రభావాన్ని చూపి మార్పులు తీసుకొని రాగల్గునంతటి శక్తివంతములు. చివరకు శాస్త్రవేత్తలు"ఉత్తమ మానవజాతి నిర్మాణం సాధ్యమే"యను నభిప్రాయమునకు వచ్చిరి. ఈ అభిప్రాయమునే లక్షల సంవత్సరాలకు పూర్వం భారతీయ ఋషులు కలిగియుండిరి. ఆ దృష్టితోనే యీ పదహారు సంస్కారాలు రూపొందించబడినవి. శారీరక వికాసమునకు గూడా వారు సంస్కారాలలో తగిన ప్రయత్నం చేశారు.

ఆయుర్వేద వైద్యగ్రంథాలలోనే గాక ఆధ్యాత్మిక గ్రంథాలైన ఉపనిషదాది గ్రంథాలలో కూడా గర్భాధాన సంస్కార వర్ణన, దాని ఆవశ్యకతను

వివరించియుండిరి. బృహదారణ్యకోపనిషత్‌లో గర్భాధాన వర్ణన వివరంగా నున్నది. మాక్స్‌ముల్లర్ పండితుడు ఈ ఉపనిషత్తులను ఆంగ్లభాషలోనికి అనువాదం చేయుచు ఈ భాగం వచ్చినచోట అదియొక అశ్లీల వర్ణనగా భావించి ఆ గర్భాధాన వర్ణన భాగమును ఆంగ్లంలోనికి గాక లాటిన్ భాషలోని కనువాదము చేసెను. సామాన్యంగా లాటిన్ భాష అందరకు రాదు. కనుక, ఆ భాగమును వదలిపెట్టుదు రను ఉద్దేశ్యంతో ఆ విధంగా అనువదించిరి. కాని, వారి దృష్టికోణం సరియైనదికాదు. ఉత్తమ సమాజ నిర్మాణమునకు, ఉత్తమ సంతాన ప్రాప్తికి ఈ విషయాలు సరిగా అర్థమగుట యెంతైనా అవసరము. లేకున్న చెత్త సాహిత్యాల ప్రభావం వలన అసహజ పద్ధతుల నవలంబించి యువత చెడిపోవు ప్రమాదం కలదు. అందుచేతనే నేటి విద్యావంతులు యువతకు కళాశాలలో సరియైన గర్భధారణ పద్ధతులను పాఠ్యప్రణాళికలో చేర్చుట మంచిదని అభిప్రాయపడుచున్నారు.

మహర్షి దయానందుడు తమ గ్రంథములైన సత్యార్థప్రకాశము, సంస్కారవిధు లందు సామాన్యుల కర్థమగు భాషలో గర్భధారణ గుఱించి వివరించి యున్నారు. వారిని సరిగా అర్థము చేసుకొనలేని పండితులు ఆధ్యాత్మిక గ్రంథాలలో ఈ అసభ్యవర్ణన లేమిటని నిందించుచుందురు. ఉత్తర భారతంలోని టోంకు అను పట్టణంలో జరిగిన శాస్త్ర చర్చలో మహర్షిదయానందుని శిష్యులైన పండిత శ్రీరామార్యగారితో పౌరాణిక పండితులు ఈ విషయమును గుఱించి వాదించి "మీ గురువులు నైష్ఠిక బ్రహ్మచారు లని చెప్పుచున్నారు. ఈ గర్భధారణ విషయము వారికెట్లు తెలిసినది ? వారి అనుభవములా యవి?" అని అసభ్య పదజాలంతో నిందించిరి.

[ పాశ్చాత్యులు వేదాలను, వైదిక సిద్ధాంతాలను, వేదానుయాయులను హీనముగా చిత్రించుటకు పథకం వేసికొన్న సంగతి అనేకులకు తెలిసిన విషయమే. వైదిక సాహిత్యంపైన అశ్లీలతను ఆరోపించుట వారికి వెన్నెతో పెట్టిన విద్య. వారి బైబిలు ననుసరించి ఆదాము హవ్వలు నగ్నముగా తిరుగుచుండిరి. వారు నగ్నముగా ఉన్నారను విషయం దేవుడు వారికి తెలుపలేదు. పైగా వారిని నగ్నముగా ఉంచుటకే కాబోలు జ్ఞానవృక్ష ఫలాలలను తినగూడదని ఆదేశించెను. జ్ఞానవృక్ష ఫలాలను తిని తాము నగ్నముగా ఉన్నట్లు

తెలిసికొన్న ఆదాము హవ్వలను శపించెను. ప్రసవించునపుడు బాధ ననుభవింతువని హవ్వను శపించెను.

వయసు మీరిన తరువాత మాసికధర్మం ఆగిపోయిన తరువాత దేవుడు షారాను గర్భవతిగాచేసెను. ఇటువంటి విషయాలు బైబిలులో కోకొల్లలు. మాక్స్ ముల్లర్‌కు ఈ విషయం అశ్లీలముగా కనబడక పోవుట, ఎంత పక్షపాతమో విజ్ఞులు తెలిసికొనగలరు.

వాస్తవానికి ఇటువంటి ఆక్షేపణలు కేవలం ఎదుటివారిని వ్యతిరేకించుటకే. సత్యా సత్యములను తెలిసికొనుటకు కాదు.

ఋషులు ఆయుర్వేదంలో ఊహాతీత విషయమును ప్రతిపాదించిన విషయం ఆయుర్వేదజ్ఞులకు తెలియును. ఉదాహరణకు చరక సంహిత సూత్రస్థానము, ఎనిమిదవ అధ్యాయం. అందులో స్త్రీ పురుషులు చేయు సంపర్కవిధిగురించి సామాన్య మానవుని ఊహకందని విషయాలను బోధించినారు. అందు విధినిషేధాలు రెండును గలవు. నిషిద్ధాలను వారు సేవించి తెలిసికొని యుందురా ? ఆయుర్వేదంలో పశుపక్ష్యాదుల మలమూత్రాల గురించి వ్రాయబడి ఉన్నది వారు వాటిని తిని త్రాగి తెలిసికొనిఉండివచ్చునా ? –

దానికి శ్రీ రామార్యగారు సమాధానం చెప్పుచు "మీ పురాణాలలో అసభ్య కామక్రీడలు వర్ణించబడినవి. అసహజ సంయోగ పద్ధతులు వర్ణించబడినవి. అంతేగాక, స్త్రీ గర్భంనుండి యోనిద్వారాగాక చెవులనుండి, నోటినుండి పిల్లలు పుట్టినట్లు వర్ణించబడినవి. అవి చదివి యువత చెడిపోవుచున్నదను ఆందోళనతో ఆయుర్వేద గ్రంథాలలో వర్ణించబడిన గర్భధారణ పద్ధతులను, తీసుకొనవలసిన జాగ్రత్తలను మహర్షి దయానందుడు వివరించవలసి వచ్చినది. వారి వర్ణనలలో ఏ విధమైన అసభ్యత కానరాదు. కాని, మీ పురాణాలలో; తాంత్రికగ్రంథాలలో నేటి కామ క్రీడా సంబంధ పుస్తకాలలోకంటె వందలరెట్లు అసభ్యమైన వర్ణనలున్న"వని సమాధానము చెప్పిరి. దానితో పౌరాణిక పండితులందరు అవాక్కయి తలలు వంచుకొనిరి. కనుక, ఈ విషయాలు సరిగా అర్థం చేసికొనుట ఎంతైనా అవసరం.

గర్భధారణ విషయంలో గమనించవలసిన ముఖ్య విషయాలు

ప్రఖ్యాత ఆయుర్వేద గ్రంథమైన సుశ్రుతంలో ఈ విధంగా వ్రాయబడినది. "**ధృవం చతుర్ణాం సాన్నిధ్యాత్ గర్భః స్యాద్విధిపూర్వక ఋతుక్షేత్రామ్బు బీజానం సంయోగాత్ అంకురో యథా ॥** గర్భధారణకు ఋతువు, క్షేత్రము, అంబు, బీజము అను నాలుగు విధిపూర్వకముగా కలసినప్పుడే గర్భం స్థిరపడును." అందుచే ఈ విషయాలను వివరంగా తెలిసికొనవలెను.

## ఋతువు

ప్రకృతిలో - సంవత్సరంలో ఆరు ఋతువులుండును. ఇవి వాటి ప్రత్యేక గుణాలను కలిగి యుండును. అంతుచేత ప్రతి ఋతువు పశు పక్ష్యాదులపైన, మానవులపైన, వృక్షజాతిపైన తన ప్రభావమును చూపుచుండును. అట్లే, మానవ శరీరంలో గర్భధారణకనువైన సమయం ఒకటి కలదు, దానినే ఇచట ఋతువందురు. వసంత కాలంలో కొన్ని చెట్లు చిగురించి, పుష్పించి ఫలాలను కాయును. అవి మఱియొక ఋతువులో కాయవు. అట్లే, మానవ శరీరంలో గర్భం స్థిరపడుటకు ఋతుకాలం కలదు. ముఖ్యంగా స్త్రీ శరీరంలో గర్భధారణకనువైన పరివర్తన నెలకు ఒకటి, రెండు రోజులు మాత్రమే ఉండును.

సాధారణంగా కన్య 13, 14 సంవత్సరాలలో పుష్పవతి యగును. అప్పుడు గర్భాశయంనుండి రక్తస్రావం జరుగును. ఇది మూడు నాలుగు దినముల వఱకు ఉండును. అప్పటి నుండియే ఋతుకాలం ప్రారంభమగును. ప్రతి 28 దినముల కొకసారి యీ విధంగా స్రావము కనపడి 3, 4 దినము లుండును. అందుచేతనే దీనికి ఋతుస్రావ మను పేరు వచ్చెను. మొదటిసారి ఋతుస్రావం కనబడినంత మాత్రాన గర్భధారణవయస్సు వచ్చినట్లు తలంచరాదు. అప్పటి నుండి 2, 3 సంవత్సరాల వఱకు గర్భం వికసించుచు బలపడుచుండును. కనుక మొదటి ఋతుస్రావం నుండి మూడు సంవత్సరాల తర్వాతనే స్త్రీయందు గర్భధారణ యోగ్యత కలుగును. అప్పటి నుండి 30-35 సంవత్సరాల వఱకు గర్భకోశం గర్భధారణ యోగ్యత కలిగి యుండును. నేటి వైద్య శాస్త్రమును గర్భం ధరించుటకు 18-30 సంవత్సరాల మధ్య వయసు మిక్కిలి అనుకూలంగా నుండునని తలంచుచున్నది. ఈ విషయమును దృష్టిలో పెట్టుకొని మన దేశంలో స్త్రీలు 18 సంవత్సరముల ప్రాయం వచ్చువరకు వివాహం చేసుకొన

గూడదని శాసనం చేసిరి.

సాధారణంగా ఋతుస్రావమగుపడుటకు 12 మొదలు 14 దినముల ముందు స్త్రీ గర్భకోశమునకు ఇరువైపుల నుండు అండకోశాల నుండి (ఏదో ఒక అండకోశం నుండి) ఒక అండం పక్వమై అండవాహకనాళం ద్వారా నెమ్మదిగా పయనించుచు గర్భకోశంవైపు వచ్చుచుండును. అండకోశము నుండి వీడిన పిమ్మట అండం 24 గంటల వరకు మాత్రమే జీవించి యుండును. తరువాత శిథలమై పోవును. కావున ఈ 24 గంటలలోనే వీర్యసంపర్కం జరుగవలసి యుండును. లేకున్న గర్భధారణ జరుగదు. పురుషుని వీర్యాణువులు స్త్రీయోనియందు గాని, గర్భకోశమునందు గాని, అండవాహకనాళమందుకాని 48 గంటల కంటె అధిక సమయము జీవించజాలవు. కనుక అండం అండాశయమును వీడిన 24 గంటల లోపున పురుష సంపర్కం జరిగిననే గర్భధారణ యగును. కనుక గర్భధారణకు నెలకు రెండు, మూడు రోజులు మాత్రమే అనువైన కాలం.

అయితే, అండం ఎప్పుడు విడుదల యగునో సరిగా నిర్ణయించటం కష్టం. దానికి నేటి వైద్య శాస్త్రం కొన్ని సూచనల నిచ్చుచున్నది. అండం విడుదల అయిన సమయంలో శారీరక ఉష్ణోగ్రత కొద్దిగా పెరుగును. అది జాగ్రత్తగా గుర్తించవలెను. ఇది సాధారణంగా సరిగా 28 దినములకు ఋతుస్రావమగు వారికి ఋతుస్రావం కనిపించిన నాటినుండి 14 దినములు లెక్కించవలెను. 14వ నాడు లేక 15వ నాడు అండం విడుదలయగును. అయితే, ఋతువు ఎగుడుదిగుడుగా వచ్చు వారికి ఈ లెక్కలలో కూడ భేదముండును.

అండం విడుదలైన సమయంలోనే స్త్రీకి ప్రకృతి సహజమైన అనగా స్వాభావికమైన కామేచ్ఛ కలుగును. అదియే గర్భాధానమునకు సరియైన ఋతుకాలం. జంతువులు ప్రకృతి సహజంగా జీవించుట వలన ఇది స్పష్టంగా కనిపించును. జాగ్రత్తగా గుర్తించగలిగిన స్త్రీలకు గూడా ఇది అనుభవైకవేద్యమే నంటారు. ఈ విషయమును శ్రీమతి మేరీ కార్మాయికేల్ స్టోక్స్ అనునామె చేసిన పరిశోధనలు ఋజువుచేయుచున్నవి. ఆమె అనేక మంది స్త్రీలను పరీక్షించి తన పరిశోధనలను వివరించుచు. **'మ్యారీడ్ లవ్'** అను నొక గ్రంథమును వ్రాసిరి. అందు స్త్రీకి సహజమైన సమాగమేచ్ఛ నెలకు రెండు

సార్లు 15 దినముల వ్యవధిలో కలుగుచున్నదని వ్రాసిరి. ఒక ప్రేరణ ఋతుస్రావ మగుపడుటకు ఒకటి రెండు దినములు ముందుగను, మరియొక ప్రేరణ ఋతుస్రావం ప్రారంభించిన దినము నుండి 15 లేదా 16వ దినమున కలుగుచున్నదని గుర్తించిరి. ఇందు ఋతుస్రావమునకు ఒకటి రెండు దినముల ముందువచ్చునది నిరర్థకమని గ్రహించ నగును. దాని వలన గర్భధారణ జరుగదు. రెండవ ప్రేరణయే (ఋతుస్రావము కనబడిన దినము నుండి 15వ దినమున) గర్భధారణ కనువైన ప్రేరణ.

జీవవిజ్ఞాన దృష్టితో–ఆకలి అయినప్పుడు ఆహారం తీసుకొనవలెను. నిద్ర వచ్చినప్పుడు నిద్రపోవలెను. దాహమైనపుడు నీరు త్రాగవలెను. అట్లే, కామేచ్ఛ కలిగినపుడు మాత్రమే సమాగమము చేయవలెను. ఆకలి లేనపుడు తినుట, దాహం లేనపుడు నీరు త్రాగుట, నిద్ర రానపుడు నిదురకై యత్నించుట యెట్లు అనారోగ్యకరమో అట్లే కామేచ్ఛ లేనప్పుడు సమాగమము చేయుట కూడా అనారోగ్యకరమే. ఆ ఫలితం వెంటనే కనబడక పోయినను కాలాంతరమున నాడీ మండలంపై తన ప్రభావమును చూపును. అండం విడుదలయిన ఋతుసమయంలో సమాగమము జరుగని యెడల ఆ అండము 24 గంటలలో చనిపోవును. గర్భకోశంలోని పొర మందమగును. గర్భధారణ జరుగలేదు కనుక రెండు వారాల తరువాత శిథిలమై రక్తం స్రవించి రక్తంతో పాటు అండం కూడా ఋతుస్రావంగా బయటకు వెడలును.

పురుషునిలో పై విధమైన ఋతుక్రమ మేమియు నుండదు. ఋతుసమయంకూడా నుండదు. 16వ సంవత్సరం నుండి వీర్యోత్పత్తి జరుగుచున్నను 25వ సంవత్సరం వఱకు వీర్యాణువులు పుష్టిని పొందజాలవు. పుష్టిని పొందిన వీర్యాణువులే ఆరోగ్యవంతమైన సంతానమును కలుగజేయును. 25వ సంవత్సరం నుండి యౌవనావస్థ ప్రారంభమై 40వ సంవత్సరం వరకు క్రమక్రముగా వృద్ధియగుచు 40వ సంవత్సరం నాటికి పరిపూర్ణత చెందుననియు, అప్పటి నుండి క్రమంగా వృద్ధావస్థ ప్రారంభమగుననియు, దానితోపాటు వీర్య శక్తి కూడా తగ్గుననియు ఆయుర్వేద గ్రంథాలలో వ్రాయబడి యున్నది. దీనిని నేటి ఆధునిక వైద్య విజ్ఞానం కూడా అంగీకరించును.

"చతస్రో అవస్థాః శరీరస్య, వృద్ధిర్యవ్వనం సంపూర్ణతా కించిత్ పరిహాణిశ్చేతి,

**ఆ షోడశాత్ వృద్ధిః, ఆ చతుర్వింశతే ర్వ్యవ్వనం, చత్వారింశతః సంపూర్ణతా, తతః కించిత్ పరిహాణిశ్చేతి** (సుశ్రుత సంహిత) అని చెప్పబడినది. పురుషుని వీర్యరక్షణ గురించి ప్రాచీన శాస్త్రాలలో అట్టి నియమాల నేర్పరిచిరి. బ్రహ్మచర్య, వానప్రస్థ సంన్యాస ఆశ్రమాలలో నియమంగా వీర్యరక్షణ చేసికొనవలెననియు, గృహస్థాశ్రమంలో కేవలం సంతానార్థం మాత్రమే వీర్య దానం చేయవలెననియు చెప్పబడినది.

**"త్రయో ఉపస్థంభాః శరీరస్య ఆహారః స్వప్నో బ్రహ్మచర్య మితి"** అనగా ఆరోగ్యవంతమైన దీర్ఘ జీవనమునకు మూడు ఆధారాలు. అవి 1) ఉత్తమమైన ఆహారం, 2) ప్రశాంతమైన నిద్ర, 3) బ్రహ్మచర్యపాలన.

నేటి ఆధునిక వైద్యులు బ్రహ్మచర్యము నంగీకరించరు. వీర్యనష్టం ఏమంత ప్రమాదకరం కాదనియు, పురుషునకు సహజంగా వీర్యనష్టం జరుగుచుండుననియు, కొన్ని సమయాలందు వీర్యనష్టం చేసికొనుటయే మంచిదనియు వాదింతురు. అందుకు ప్రోత్సహించు వైద్యసలహాలను కూడా ఇత్తురు. వారి దృష్టిలో స్త్రీలకు ఋతుస్రావ మగునట్లే పురుషులకు వీర్యనష్టం జరుగుచుండవలెననియు, బలవంతంగా ఆపుటకు యత్నించిన కొన్ని మానసిక రోగాలు వచ్చుచున్నవనియు చెప్పుచున్నారు. ఇదిపూర్తిగా యథార్థం కాదు. నేటి సామాజిక జీవనం అటువంటి ప్రేరణ కలిగించుచున్నదేకాని సహజంగా కాదు. ఏ జంతువులకూ వీర్యనష్టం దానంతట అది జరుగదు. ఋతుకాలంలోనే ఆడ జంతువులతో కలియును. కృత్రిమ పద్ధతులలో వీర్యనష్టం జరుపుకొనుట వలన నాడీ మండల దుర్బలత్వం ఏర్పడును. బ్రహ్మచర్యపాలన వలన ఎట్టి హానియు జరుగదు. ఆ వీర్యం ఓజఃశక్తిగా మారి శరీరం బలపడును. దీర్ఘజీవనం లభించును. దీనిని గురించి ఆధునిక వైద్యులు పునరాలోచించవలసి యున్నది.

## క్షేత్రము

విత్తనాలు నాటుటకు సిద్ధం చేయబడిన భూమిని క్షేత్ర మందురు. మంచి పంటలు, దిగుబడి కావలెననిన మంచి విత్తనాలను సేకరించుటతో పాటు మంచి భూమిని ఎన్నుకొని దానిలోని రాళ్లు మొదలైన వాటిని ఏరివేసి, చక్కగా

దున్ని, నీరు పెట్టి సిద్ధం చేయవలసి యుండును. అట్లే, మంచి బలారోగ్యాలతో కూడిన సంతానం కొఱకు క్షేత్ర సమానమైన గర్భకోశాన్ని సిద్ధం చేయవలసి యున్నది. ప్రకృతిలో సహజంగా ఈ యేర్పాటు కలదు. ఆరోగ్యవంతమైన స్త్రీ గర్భాశయంలో ప్రతి నెల క్రమపద్ధతిలో కొన్ని మార్పులు జరుగుచుండును. ఋతుస్రావం ముగిసిన 4వ లేదా 6వ దినం నుండి మఱల గర్భం ధరించుటకు అనువుగా గర్భాశయ గోడలలో మార్పు జరుగుచుండును. ఈస్ట్రోజన్ అను హార్మోను ప్రభావంవలన క్రమంగా గర్భాశయగోడలు దళసరెక్కి వాటియందు క్రొత్త రక్తనాళాలు తయారగును. 14వ దినమున అండము విడుదలయగును. ఆ ఋతుసమయమున శుక్రాణు సంయోగాన గర్భధారణ జరిగిన క్రమంగా నావిధంగానే గర్భాశయ గోడలు మరింత బలపడుచు, బిడ్డను పోషించుచు శక్తివంతమగుచుండును. 40 వారాల అనంతరం ప్రసవ సమయాన ఆ క్రొత్తగా ఏర్పడిన దళసరి పొర శిథిలమై ప్రసవం జరుగును.

గర్భాధారణ జరుగని యెడల కొన్ని హార్మోన్ల ప్రభావం వలన 14వ దినం నుండి 28వ దినం వఱకు 2 వారాలు గర్భాశయంలో కొంత మార్పు జరిగి 28వ దినమున శిథిలమై ఋతుస్రావంగా బయటకు వచ్చును. ఈ ఋతుస్రావం సాధారణంగా మూడు మొదలు నాలుగు దినములుండును. మొదటి రెండు దినములు కొంత అధికంగా నుండును. సాధారణంగా ఈ స్రావం 100 మి.లీ. లేదా 32 ఔన్సులుండును. ఈ రక్తం మన శరీరంలో ఏదైనా భాగం తెగినప్పుడు వచ్చు రక్తంకన్న కొంత భేదంగా నుండును. ఈ రక్తం కొద్దిగా నల్లగానుండి గడ్డ కట్టదు. కొన్ని ఎపిథీలియల్ పొరలు మాత్ర ముండును. బట్టకు అంటినను మరక పడదు. స్రవించునపుడు ఎట్టి బాధయు నుండదు. చెడ్డవాసన యుండదు. ఇది ప్రకృతిలో జరుగు సహజ క్షేత్రీకరణ. ఆయుర్వేద గ్రంథాలలో ఈ విషయం ఈవిధంగా వర్ణించబడినది.

శ్లో॥ గుంజాఫలసవర్ణం చ పద్మాలక్తకసన్నిభం ।
ఇంద్రగోపసంకాశం ఆర్తవం శుద్ధమేవ తత్ ॥

శ్లో॥ మాసన్నిష్పిచ్ఛ దాహార్తి పంచరాత్రానుబంధి చ
నైవాతిబహు నాత్యల్పం తదార్తవం శుద్ధమాదిశేత్ ॥ (చరకము)

**శ్లో॥ శశాస్రృక్ ప్రతిమం యక్తు యద్వా లాక్షారసోపమమ్**

**తదర్తావం ప్రశంసంతి యద్వాసో న విరజ్జయేత్ (సుశ్రుతము)**

అనగా : ఏ ఋతురక్తం ఎఱ్ఱటి కమలపురంగు కలిగియుండునో, యే రక్తం సరిగా నెల తర్వాత ఏ బాధయులేక స్రవించునో, యే బాధయులేక అయిదు రాత్రులుండునో, యెక్కువ తక్కువలు లేకుండునో దానిని శుద్ధ ఋతుస్రావ మని తెలుసుకొనవలెను. దీనికి భిన్నంగా ఋతువు ఆలస్యంగా వచ్చినను, స్రావం ఎక్కువ తక్కువలుగా నున్నను దానిలో కుదుపలున్నను, వాసన యున్నను, బట్ట డాగుపడుచున్నను, స్రవించునప్పుడు బాధ యున్నను అవి గర్భకోశవ్యాధులను సూచించును. వీటితోపాటు కొంతమందికి శరీరంలో వేరు అవయవాలందు కొన్ని బాధలు కలుగుచుండును. వీటిని సరియైన మందుల ద్వారా నివారించినపుడు మాత్రమే గర్భధారణ చక్కగా జరుగును. ఋతుస్రావమునకు ముందు స్త్రీజననేంద్రియమునందు రక్త మధికముగా చేరుటవలన కొద్దిపాటి భారమున్నను, చిన్న చిన్న శారీరక మార్పులున్నను అనారోగ్యకరం కాదు.

ఆయుర్వేద గ్రంథాలలో శుద్ధ ఋతుస్రావం కలిగిన స్త్రీయే గర్భధారణ చేయగలుగునని వ్రాయబడియున్నది. ఈ సందర్భమున ఒక ఉపమానం ఇవ్వబడినది.

**శ్లో॥ నిపాతాత్‌యేవ గృహాణతి రాగం వసో యథామలమ్**

**ధ్రువం గర్భం తథా బీజం క్షేత్ర బీజం ఉపస్మృతమ్ ॥**

అనగా యే విధంగా మలరహితమైన శుద్ధ వస్త్రం రంగును గ్రహించగలుగునో, ఆ విధంగా శుద్ధి చేయబడిన గర్భాశయం పురుష బీజమును స్వీకరించి గర్భధారణ చేయగలుగును.

ఏ ఋతుస్రావం ఎఱ్ఱని లక్కవంటి రంగు కలిగియుండునో బట్టకు అంటుకొని ఉతికిన డాగుపడదో అది శుద్ధ ఋతుస్రావమని గ్రహింపవలెను.

ఋతుస్రావంలోని దోషాలను బట్టి గర్భాశయ వ్యాధులను తెలిసికొని చికిత్స జరుపవచ్చును. సాధారణంగా వచ్చు అన్ని గర్భాశయ వ్యాధులకు ఆయుర్వేదంలో మంచి ఔషధాలు గలవు. అనుభవజ్ఞులైన వైద్యుల పర్యవేక్షణలో

చికిత్స జరుపవచ్చును. హోమియోపతి వైద్యంలోనూ చాలా మంచి మందులు కలవు. పై వ్యాధులన్నిటికి చాలా తేలికగా తియ్యటి మాత్రలతో నివారణ చేయవచ్చును. అనుభవజ్ఞులైన వైద్యుల ద్వారా చికిత్స జరుపుకొనునపుడు మాత్రమే లాభముండును. పుస్తకాలలో వ్రాసిన మందులను చదివి వాడుటవలన పెద్దగా లాభం కలుగదు. పెద్ద పెద్ద ప్రకటనలను చూసి మోసపోకూడదు.

ప్రకృతిలో జరుగు సహజ ఋతుస్రావమును ప్రాకృతిక క్షేత్రీకరణమనియు, ఔషధాలతో సరిచేయబడిన ఋతుస్రావమును ఔషధీజన్య క్షేత్రీకరణమనియు నందురు. గర్భధారణ కలుగకుండుటకు (వంధ్యత్వమునకు) సాధారణమైన కొన్ని కారణాలు ఇచట చెప్పబడుచున్నవి. వాటిని సరిచేసినపుడే గర్భం నిలచును.

(1) యోనియందు స్రవించు స్రావం సహజంగా కొద్ది క్షారతత్వమును కలిగియుండును. అందు వీర్యాణువులు చైతన్యవంతంగా పయనించగలుగును. కొంతమంది స్త్రీలయందు ఈ స్రావం ఆమ్లతత్వమును కలిగియుండును. అందుచే వీర్యాణువులు నశించును. (2) గర్భాశయము సరియైన స్థానంలో నుండక స్థానభ్రంశం చెందుట వలన గర్భం నిలువదు. (3) అండాశయమునందు కంతులు మొదలైనవి యున్నయెడల అండం విడుదల కాదు. (4) సుఖవ్యాధులు కలిగినవారికి ఆయా క్రిముల ప్రభావంవలన అండము, వీర్యాణువులు నశించిపోవుచుండును. (5) యోనియందు రాపిడి కలుగకుండ ఒక అమత్వచము కలదు. అందు కొద్దిగా తేమ స్రవించుచుండును. అది అధికంగా స్రవించుచున్న తెల్లబట్ట (లుకోరియా) ఎక్కువగా నుండును. అందుచే గర్భం రాదు. (6) ఎక్కువ ముట్టు నొప్పి కలుగుటకు గర్భద్వారంలో కలుగు ఈడ్పు (స్పాసమ్) కారణం. దీనినే ఋతుశూల యందురు. ఇది కలిగిన స్త్రీలలో వీర్యసేచన యనంతరం వీర్యం గర్భంలోనికి పోకుండా ఈడ్పుకలిగి గర్భం రాకుండా చేయవచ్చును. (7) ఋతుస్రావం ఎక్కువ తక్కువగా నుండుటవలన కూడా గర్భంనిలువక పోవచ్చును. (8) గర్భాశయంలోగాని అండవాహికలోగాని కంతులు (ట్యూమర్స్) పెరుగుటవలన, గర్భాశయద్వారం గట్టిపడుటవలన (సర్విసైటిస్) గర్భం రాదు. (9) కొంతమందిలో గర్భాశయం

ఎదుగక పిల్లల్లోపలె (ఇన్ఫెంటైల్ యూటరస్) ఉండును, గర్భ ద్వారంకూడా చాలా సన్నగా (పిన్‌హోల్ సర్‌విక్స్) ఉండును. ఇటువంటి వారిలో గర్భధారణ జరుగదు. (10) సంభోగసమయంలో స్త్రీఅవయవమునందు చిక్కని జిగురువంటి స్రావము కొందరిలో ఎక్కువగా తయారగుచుండును. అందువలన వీర్యాణువులు పయనించలేక చనిపోవును. (11) మితిమీరిన శారీరక, మానసిక పరిశ్రమవలనను లేదా పరిశ్రమలేని సోమరితనంవలనను గర్భాధారణ జరుగదు. అతిస్థౌల్యత గర్భాధారణ జరుగకుండ చేయును. ఆహారంలో కొన్ని పోషక పదార్థాల లోపంవలన గర్భధారణ జరుగక పోవచ్చును. విటమిన్ ఎ.బి.ఇ లు ముఖ్యంగా అండమును ఆరోగ్యవంతంగా నుంచును. అవి లోపించినను గర్భధారణ జరుగదు. (12) అమిత సంభోగం వలన మొదటిసారిలోకన్న తరువాత వీర్యాణువులు బలహీనంగా నగుచుండును. స్త్రీ జననేంద్రియంలో తేమలేకుండా పోవును. ఆ సమయంలో అండం విడుదలైనను గర్భం నిలువదు. (13) కొంతమంది స్త్రీలలో అండం పది, పన్నెండు గంటలకన్న ఎక్కువ జీవించలేదు. అందువలన గర్భం రాకపోవచ్చును. గాన వీటికి తగిన చికిత్సచేసి క్షేత్రమును శుద్ధం చేయవలెను.

## 3. అంబు

అంబు అనగా జల మని అర్థం. మంచి క్షేత్రంలో నాటిన విత్తనం మంచిదైనప్పటికి అది మొలకెత్తి పెరిగి పెద్దదగుటకు మంచి నీరు అవసరం. అట్లే, గర్భకోశంలో వీర్యాణువు అండంతో కలిసిన తదుపరి అది పెరిగి పెద్దదగుటకు పోషకవంతమైన జల మవసరం. ఇట స్త్రీయొక్క రక్తమే ఆ జలం. వీర్యాణువులతో కొంత ప్రోస్ట్రేటిక్ గ్రంథి స్రావం వచ్చును. అది పోషకవంతమైన ఆల్బుమిన్ కలిగియుండును. ఆ పదార్థం వీర్యాణువులకు ఆహారముగానుండి అవి యోని ద్వారంగుండా లోపలకు పోవుటకు సహాయపడును. దానిని కూడా అంబు అనవచ్చును. యోని యందును, గర్భకోశ అండవాహికల యందును కొంత తేమ ఉండును. అదియును వీర్యాణువులు పయనించుటకు తోడ్పడును. అది కొంతమందిలో చాలా తక్కువగాను, పొడిగాను ఉండును. అప్పుడు వీర్యాణువులు పయనించజాలవు.

స్త్రీలలోని ఆ తేమను కూడా అంబు అనవచ్చును. అండవాహికలో అండంతో వీర్యాణువులు సంయోగంచెంది, నెమ్మదిగా పయనించి గర్భకోశమును చేరును. అచ్చట గర్భకోశం లోపలిపొర (ఎండోమెట్రియమ్)కు అంటుకొని (నాటుకొని) ఆ పొరద్వారా రక్తమును పొంది పెరుగుచుండును. ఆ పొరలోని ఒకభాగం రక్తనాళంగా మారి పిండంయొక్క నాభికి అంటుకొనియుండి రక్తము నందించుచుండును. ఆ రక్తంవలననే పిండం పెరిగి పెద్దదగుచుండును. అందుచే గర్భిణీ స్త్రీకి యిద్దరకు సరిపడునంత పోషకాహారం ఇవ్వవలసియుండును. ఆహారపోషణ సరిగా లేకున్న పిండం ఎదుగుదల సరిగా నుండదు. దీనిని ముఖ్యమైన అంబు అనవచ్చును. పై మూడు రకముల జలములలో లోపములున్న యెడల సరి చేయవలెను. అప్పుడే గర్భం నిలుచును.

## బీజము

బీజ మనగా విత్తనం. ఇది పురుషుని వీర్యంలో నుండు వీర్యాణువు. పూర్వ ప్రకరణంలో వివరించినట్లు ఇది యొక చిన్న కణం. 23 ఒంటరి క్రోమోజోములతో ఒక తోకవంటి అవయవము కలిగి యుండును. ఆ తోకయొక్క క్రిమి చలనం వలన ఈ వీర్యాణువులు ముందుకు పయనించగలుగుచుండును. స్త్రీ యోనియందు సేచన చేయబడిన వీర్యాణువులు తోకతో ప్రాకుచు గర్భకోశద్వారంనుండి అండమును వెదుకుచు అండనాళాల వఱకు పయనించును. అండంలో కలియుటకు ఒక వీర్యాణువు మాత్రమే అవసరమైనను ఒకసారి వీర్యసేచన యందు 30 నుండి 40 మిలియన్ల వీర్యాణువు లుండును. ఇవి ఆరోగ్యవంతముగా చైతన్యవంతంగా నుండిననే పయనించి అండమును కలిసి గర్భధారణ చేయగలవు.

వీర్యాణువులు నిర్బలంగా నున్నను, తొందరగా చనిపోవుచున్నను చికిత్సద్వారా సరిచేయవలసి యుండును. మైక్రోస్కోప్ ద్వారా వాటి స్థితిని మనం తెలిసికొనవచ్చును. కృత్రిమపద్ధతిద్వారా వీర్యమును సేకరించి వీలైనంత తొందరగా దానిని సూక్ష్మదర్శినితో పరిశీలించిన ద్రవంలో ఈదుచున్న

వీర్యాణువులు కనబడును. అందు కొన్ని చైతన్యవంతంగాను, మఱికొన్ని చైతన్యరహిత స్థితిలోను, మఱికొన్ని చనిపోయి కనబడును. వాటియొక్క శాతాన్నిబట్టి వీర్యంయొక్క స్థితిని అర్థం చేసికొనవచ్చును. మందులతో ఆ లోపాలను సరిచేయ వచ్చును. మా అనుభవంలో అతి తక్కువగా వీర్యాణువులున్న రోగులు, చనిపోయిన వీర్యాణువులు ఎక్కువ శాతమున్న రోగులు కూడా బాగుపడుట చూచితిమి. కొంతమందిలో వీర్యాణువులేమియు కనబడవు. అట్టి వారికి సంతానం కలుగదు. కనుక పిల్లలు కలుగకున్న ముందు పురుషుని వీర్యాన్ని పరీక్షించి దానిలో లోపం లేనియెడల స్త్రీయందుగల లోపాలను వెదుకవలెను.

సాధారణంగా వీర్యాణువులు ఏమాత్రం లేకుండాపోవుట (అజూస్పెర్మియా)కు కారణం గవదబిళ్ళ లని చెప్పుదురు. గవదబిళ్ళలకు సరియైన మందు ఇవ్వనపుడు అవి యటనుండి పురుషుల వీర్యకోశంలో చేరి వాటిని రోగగ్రస్తం చేయును. మఱియొక కారణం బీజవాహక గొట్టములలో (స్పెర్మాటిక్ కార్డ్‌లో) అడ్డు ఉన్నయెడల కూడా వీర్యంలో వీర్యాణువులు రావు. ఈ అడ్డుకు కారణం సుఖవ్యాధులు, క్షయ, మశూచికం, వరిబీజం, కంతులు మొదలగునవి కావచ్చును. అందుకొన్నిటిని మందులతో సరిచేయవచ్చును. కొన్ని అసాధ్యం.

ఈ బీజాలు ఆరోగ్యవంతముగా బలంగా నుండుటకు బ్రహ్మచర్యపాలన ఎంతో అవసరం. ఆహారంలో ఎ.బి.ఇ. విటమిన్‌లు ఎక్కువగా తీసికొనుట అవసరం. అమిత సంభోగంవలన వీర్యాణువులు బలహీనపడుటయేగాక మరియొక హానికూడా జరుగును. బీజకోశాలు వీర్యాణువుల నుత్పత్తిచేయుటతో పాటు కొన్ని హార్మోనుల నుత్పత్తి చేయును. అవి నేరుగా రక్తంలో కలిసి నాడీమండలానికి శక్తినిచ్చుచుండును. అమిత సంభోగంవలన బీజకోశాలు వీర్యాణువుల నెక్కువగా నుత్పత్తి చేయజాలక పోవును. అందుచే నాడీమండల దర్బలత, తద్వారా అనేక శారీరక క్రియలలో లోపాలు ఏర్పడునని కొందరి వైద్యుల అభిప్రాయం.

ఆయుర్వేద గ్రంథాలలో శుక్రోత్పత్తి గురించి మరియొక విధంగా వర్ణన

కలదు. మానవశరీరం సప్తధాతు నిర్మితమనియు, ఆహారసారమే క్రమంగా పరిణతి చెందుచు చివరి ధాతువుగా శుక్రం తయారగుననియు వర్ణనకలదు.

శ్లో॥ రసాద్రక్తం తతో మాంసం మాంసాన్మేదః ప్రజాయతే ।
మేదసోఽస్థి తతో మజ్జా మజ్జః శుక్రం తు జాయతే ॥ (సుశ్రుత-సూత్ర. 1410)

మనం తీసుకొనిన ఆహారం జీర్ణమై మొదట రసధాతువు ఏర్పడును. ఆ రసధాతువునుండి రక్తం, రక్తంనుండి మాంసం, మాంసం నుండి క్రొవ్వు, క్రొవ్వునుండి ఎముక, ఎముకనుండి మజ్జ, మజ్జనుండి శుక్రం అనుధాతువులు పుట్టుచున్నవి. ఒక ధాతువునుండి మరొక ధాతువు నిర్మితమగుటకు దాదాపు అయిదు దినములు పట్టుననియు, అట్లు పరిణతి చెందుచున్నప్పుడు కొంత సారహీనపదార్థం (కిట్టము) ఏర్పడుననియు కూడా వర్ణింపబడినది.

**శ్లో॥ కఫః పిత్తం మలః ఖేషు స్వేదః స్యాన్నఖ రోమ చ**
**నేత్ర పట్ త్వక్షు చ స్నేహో, ధాతూనాం క్రమశో మలాః ॥**

(సుశ్రుత-సూత్ర 46-529)

రసధాతువునుండి రక్తం నిర్మాణమగునపుడు సారహీనభాగం (మలం) కఫంగాను, రక్త మలం పిత్తంగాను, మాంస మలం శ్రోత్ర ముఖాదులందలి గులిమి, పాచి మొదలగునవిగాను, మేధోమలం స్వేదంగాను, అస్తిమలం నఖరోమములుగాను; మజ్జయొక్క మలం కండ్లపుసులు, చర్మముపైన తైలముగాను ఏర్పడు-నని ఈ శ్లోక భావం. దీనిని బట్టి క్రూడాయిలు నుండి పెట్రోలు నిర్మాణం చేయునపుడు వివిధరకాల పదార్థాలుత్పన్నమై వేరువేరు ప్రయోజనాలు కలుగునట్లు అన్నసారం వివిధ ధాతువులుగా పరిణతి చెందుచుండును. ఆ భాగాలన్నియు శరీరంలోని ఆ యా ధాతువులను పోషించుచు శరీరాన్ని ఆరోగ్యవంతముగా నుంచుచున్నవనియు, శుక్రము మలరహితమైన పరిశుద్ధ పదార్థ మనియు, చాలా విలువైనదనియు, దానినుండి ఓజస్సు అను గొప్పశక్తి ఉత్పన్నమై మానవునకు గొప్పదైన ఆనందము నొసంగుననియు ఆయుర్వేద గ్రంథాలలో వర్ణింపబడినది.

ఆధునిక శరీరవిజ్ఞానం ధాతునిర్మాణాన్ని గుఱించి మఱియొక రకంగా ఇట్లు వివరించును - ఆహారం జీర్ణరసాలతో కలసి విశ్లేషింపబడి రసధాతువు

ఏర్పడును. ఆ రసం (లింఫ్) రక్తంలో కలిసి కాలేయమును చేరి తనలోని యెక్కువ తక్కువ భాగాలను సవరించుకొని శరీరానికి కావలసిన పాళ్లలో పోషకాలను సంతరించుకొనును. ఊపిరితిత్తులనుండి ప్రాణవాయువును (ఆక్సిజన్‌ను) స్వీకరించి, చిన్న చిన్న రక్తనాళాల ద్వారా శరీరంలోని ప్రతి కణమునకును అందించును. ఆ యాహారసారమునందుకొని ఆ యా ధాతువులు (మాంస, అస్థి, మజ్జాది ధాతువులు) వాటంతటవిగా కణవిభజన చెందుచు వృద్ధి చెందుచుండును. అట్లే, బీజకోశంలోగూడా శుక్రాణువుల ఉత్పత్తికి, అందు నిర్మితమగు హార్మోనులకు, బహిఃస్రావాలకు రక్తమే కారణమని చెప్పను. అందుచే వీర్యమధికముగా వెడలిపోయినను నష్టమేమియు జరుగదనియు, మరల మరల రక్తంవలె వీర్యం నిర్మాణమగుచుండుననియు వారి వాదన. కొందఱు నాస్తికులైన వైద్యులు ముష్టిమైథున, వ్యభిచారాది కర్మలనుకూడా ప్రోత్సహింతురు. ఎన్నిసార్లు వీర్యనష్టం జరిగినను ఏవిధమైన హాని జరుగదనియు, నాడీమండల దుర్బలత మొదలగు వ్యాధులు కేవలము ఏదో నష్టం జరుగునను భయమువలన మాత్రమే కలుగుచున్నవనియు వారి వాదన. ఇది పూర్తిగా సత్యదూరం.

స్థూలంగా వీర్యంలో కాల్షియం అధికంగాను, సిట్రేట్ కొంత తక్కువగాను ఉండును. అనవసరంగా వీటిని వ్యర్థం చేసికొనుట ఆ ధాతువులను పోగొట్టుకొనుటయే యగును. చిన్నతనంలోనే అధిక వీర్యనష్టం చేసికొన్నవారు ఎంతో దర్బలులుగా మన కగుపడుచున్నారు. హోమియో వైద్యంలో వ్యాధులకు చికిత్స చేయునపుడు వ్యాధికారణానికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చెదరు. అధిక వీర్యనష్టం, ముష్టిమైథునాల తర్వాత నొకనికి యొకవ్యాధి కలిగినచో అతనికి కలిగిన వ్యాధిపేరుతో నిమత్తం లేకుండ అది యే వ్యాధియైనను కారణాన్ని బట్టి స్టాఫిసాగ్రియా, అసిడ్ ఫాస్, చైనా మొదలగు మందులను ఇచ్చుటవలన వారి వ్యాధులేవైనను నయమగుచుండును. ఇది హోమియో వైద్యులందరికి అనుభవైకవేద్యమే.

ఆధునిక వైద్యులు మరియొక భ్రష్ట సిద్ధాంతమును చెప్పుదురు. మనసులో కోరిక కలిగినపుడు ముష్టిమైథునం ద్వారా వీర్యనష్టం చేసుకొనని యెడల మానసికమైన ఒత్తిడికి గురియై వ్యాధిగ్రస్తులగుదురని చెప్పెదరు. ఇది

సత్యంకాదు. కోరికలను అనుభవించుట వలన అవి వృద్ధియై కోరికలయందు రాగం పెరుగునేకాని తృప్తిచెంది వైరాగ్యం కలుగదు. సామాజిక జీవనంలో ఇంద్రియనిగ్రహం అన్ని విషయాలలోను అనివార్యం. కోరికలను ప్రేరేపించు కారణాలను నిరోధించుటయు అనివార్యమే. భారతీయ ఋషి ప్రణాళిక యీ లక్ష్యంపైపే పయనించును.

[విషయ సేవనవలన తృప్తి లభింపదు. పైగా కోరికలు పెరుగును. మహర్షి మనువు -

**"న జాతు కామః కామానాం ఉపభోగేన శామ్యతి ,**

**హావిషా కృష్ణవర్త్మేభూయ ఏవాభివర్ధతే ॥** – మనుస్మృతి *(2-94)*

అనగా 'విషయాసక్తి విషయ సేవనం ద్వారా శాంతించదు. అగ్నిని అర్పుటకు నేయి వేసినచో అగ్ని పెరుగునటుల కోరిక లనబడు అగ్నులు నేయివంటి విషయాలను సేవించుట వలన పెరుగు' నని గట్టిగా తెలిపినాడు. మహారాజు భర్తృహరి **"భోగా న భుక్తా వయమేవ భుక్తా --"** అనగా - 'ప్రాపంచిక విషయాలను మానవుడు అనుభవించడు, కాని, ప్రాపంచిక విషయాలే మానవుని అనుభవించును. విషయాలు సమాప్తము కావు. మానవుని శరీరమే జీర్ణమగును' అని వ్రాసినాడు.

ప్రపంచంలో కొన్ని మొగప్రాణులు మైథునం చేయగానే చనిపోవును. ఇది పరీక్షింపబడిన సత్యం. దీనికి భౌతిక వైజ్ఞానికుల సమాధానమేమి ? నిజంగా ఆధునిక వైద్యుల జ్ఞానం ఆంశికమేకాని పూర్ణంకాదు. వారు ఇంకా పరిశోధన చేయవలసి ఉండును. అంతిమ సత్యాన్ని తెలిసికొను నంతవరకు వారు పరీక్షలు చేయుచుండుటయే మంచిది. మానవ సమాజానికి అహితకరములగు విషయాలను ప్రతిపాదించకుండుటయే మంచిది.

బ్రహ్మచర్యమును – వీర్యమును రక్షించుటవలన మానవునిలో ఆత్మోన్నతి భావాలు, ధైర్యం, సాహసం, శరీరదార్ఢ్యం మొదలగు ఉత్తమోత్తమ గుణాలు వికసించును. ఇది అనుభవగమ్యం. వీర్యనాశం వలన ఈ గుణాలు వికసించుటటుంచి అవి క్షీణించును. ]

## ఆడ శిశువా లేక మగ శిశువా ?

కొందరు దంపతులకు మగబిడ్డ కావలెననియు, మరి కొందరకు ఆడబిడ్డలు కలుగవలెననియు కోరికలుండును. దానికొరకు తెలునుకొని ప్రయత్నించవలెనను అభిలాష యుండును. కొందరికి తెలుసుకొనవలెనను జిజ్ఞాస లేక కుతూహల ముండును. ప్రాచీన ఆయుర్వేద, మనుస్మృత్యాది గ్రంథాలలో ఈ జిజ్ఞాసా ప్రయత్నాలు కనబడును. ముందుగా ఆధునిక విజ్ఞానం ఈ విషయమున ఏమి చెప్పునో తెలిసికొందాము.

అండ, శుక్రకణాలు ఒంటరి క్రోమోజోములు కలిగిన అర్ధకణాలనియు, ఆరెండిటి కలయిక వలన నొక పూర్ణకణం 23 జతల క్రోమోజోములు కలిగిన కణం తయారగుననియు మనం ఇంతకు పూర్వం తెలిసికొని యుంటిమి. ఈ క్రోమోజోములలో ఎక్స్, వై అను రెండు రకాలైన క్రోమోజోము లుండును. ప్రతి స్త్రీ అండం ఎక్స్ క్రోమోజోములను మాత్రమే కలిగియుండును. పురుషుని వీర్యకణాలలో కొన్ని ఎక్స్ క్రోమోజోములు, మరికొన్ని వై క్రోమోజోములు ఉండును. అండాన్ని చేరిన వీర్యాణువు ఎక్స్ క్రోమోజోమును కలిగినదియైన ఆ కణం ఎక్స్ + ఎక్స్ క్రోమోజోములు కలిగినదిగానై ఆడశిశువునకు జన్మనిచ్చును. వై క్రోమోజోము కలిగిన వీర్యాణువు అండంతో కలిసి ఎక్స్+వై క్రోమోజోములు కలదై మగబిడ్డకు జన్మనిచ్చును. ఇది కేవలం దైవికమైనదేకాని మానవుని చేతిలో ఏమాత్రంలేదని యిప్పటివరకు లభ్యమైన ఆధునిక విజ్ఞానం తెలుపుచున్నది.

ఇప్పటికీ శాస్త్రజ్ఞులు మన యిచ్ఛానుసారం బిడ్డలు కలుగు విషయంపై పరిశోధనలు చేయుచునే యున్నారు. పరిశోధనలలో దంపతులకు కొన్ని రకాల ఆహార పదార్థాల నిచ్చుట వలన మగబిడ్డలు కలుగుచున్నా రనియు, మరొక రకమైన ఆహార పదార్థ లిచ్చుటవలన ఆడశిశువులు కలుగుచున్నారనియు వెల్లడి చేయుచున్నారు. దీని ననుసరించి పురుషులలో కొన్ని ఆహార పదార్థాలు 'వై' క్రోమోజోములను, మరికొన్ని ఆహార పదార్థాలు 'ఎక్స్' క్రోమోజోములను పుట్టించుచున్నవని యూహించ వచ్చును.

మనుస్మృతిలో పుత్రుడు కలుగుటకు ఋతుస్రావం కనబడినదినం నుండి 16వ రాత్రి వరకు ఉన్న కాలంలో సరి రాత్రులందు సమాగమం చేసిన యెడల

పుత్రుడు కలుగుననియు, బేసి రాత్రులందు సమాగమం చేసిన ఆడపిల్లలు కలుగుదురనియు చెప్పబడినది. అందు మొదటి నాల్గు రాత్రులు స్రావనుగుచుండును కనుక త్యాజ్యములని చెప్పబడినది. దీనితోబాటు మరియొక శ్లోకములో పురుష వీర్యం అధికమైన మగబిడ్డయు, స్త్రీ రజస్సు యెక్కువైన ఆడబిడ్డయు, రజోవీర్యాలు సమానమైన నపుంసకులు కలుగుదురనియు చెప్పబడినది. మగబిడ్డల మాట యెటులున్నను స్త్రీ గర్భవతి యగుటకు పలుచని, సుకుమార శరీరము కలిగినదిగా నుండవలెనని కొందరు ఆయుర్వేదాచార్యుల యభిప్రాయం.

"ఏవంగచ్ఛన్ స్త్రియం క్షామాం" స్త్రీని క్షామాంగిగా చేయవలెననినను, కృషితాంగిగా చేయవలెనని చెప్పినను దుర్బలురాలిగా చేయుమని అభిప్రాయం కాదు. దృఢమైన సన్నటి శరీరం కలిగినదిగా చేయుమని మాత్రమే అభిప్రాయం. అందుకొరకు స్త్రీలకు క్రొవ్వు పదార్థాలను, పిండి పదార్థాలను బాగా తగ్గించి మాసంకృత్తు పదార్థాల నిచ్చుచున్న బలమైన కృషితాంగు లగుదురు. పురుషులకు పుష్టివర్ధకములైన పాలు, పెరుగు, నెయ్యి మొదలైనవి యెక్కువగా నీయవలెను. పశుపాలకులు ఇప్పటికిని దీనిని ఆచరణలో పెట్టుచుందురు. మేత తక్కువగా పెట్టి ఆవులను, గేదెలను కొంత కృశింపజేయుదురు. పుష్టికరమైన మేతతో వీర్యదానం చేయు ఆబోతు, దున్న పోతులను పుష్టి కలిగినవిగా చేయుదురు.

పై అభిప్రాయాలతో డా॥ ట్రాల్ చేసిన పరిశోధనా ఫలితాలు సరిపోవుచున్నవి. వీరు క్రీ.శ. 1897వ సంవత్సరంలో తమ పరిశోధనా ఫలితాలను ఒక పుస్తకంగా ప్రచురించిరి. అందు ఒకప్పుడు బాలుడు మరి యొకప్పుడు బాలిక కలుగుచున్న దెందులకు? అను ప్రశ్నకు "ఇరువురిలో యెవరు బలవంతులో ఆ సంతానం వారి ననుసరించి యుండును. స్త్రీరజస్సు బలముకలిగినదియైన బాలిక కలుగును. పురుషుని వీర్యబలం అధికమైన బాలుడు కలుగు"నని సమాధాన మొసగిరి. ఇది కేవలం బలమునకు సంబంధించినది మాత్రమే. సృష్టి అంతట యిదే నియమం కనబడుచున్నది. రెండు విరుద్ధ శక్తులు కలిసిన బలం కలిగినదియే తన ప్రభావమును చూపును......"పురుషుడు ఆయువులోను, బలంలోను అధికుడైన మగ సంతానం,

స్త్రీ అయువులోను, బలంలోను అధికమైన ఆడబిడ్డలు కలుగుదురు". మరియొక చోట మరికొన్ని అనుభవాలతో చూసిన ఋతుస్నానాంతరం మొదటి రాత్రులలో కలిసిన ఆడబిడ్డలు, తరువాత దినములలో కలిసిన మగ పిల్లలు కలుగుట చాలా మందిలో చూడబడినది.

జర్మన్ శాస్త్రజ్ఞుడు Dr. Sikst "పురుషుల కుడి బీజకోశం నుండి తయారైన వీర్యం మగబిడ్డలను కలిగించుననియు, ఎడమ బీజకోశం నుండి తయారైన వీర్యం ఆడబిడ్డలను కలిగించుననియు" చెప్పుచున్నారు. ఇది సత్యం కాదు. జంతువులలో కొన్నిటికి కుడి బీజకోశము, మరి కొన్నిటికి యెడమ బీజకోశము తొలగించినను వాటికి ఆడ, మగ పిల్లలు పుట్టుట జరిగినది.

డా॥ గెడింగ్స్ "కాజేషన్ ఆఫ్ సెక్స్" అను తమ గ్రంథంలో స్త్రీయొక్క కుడి అండకోశం నుండి విడుదలైన అండం మగబిడ్డకు, యెడమ అండకోశము నుండి విడుదలైన అండం ఆడబిడ్డకు జన్మనిచ్చునని వ్రాసిరి. స్త్రీలయందు ప్రతినెల ఒక అండకోశం నుండి ఒక అండము మాత్రమే విడుదలయగును. ఒకనెల కుడివైపున విడుదలైన, తరువాత నెల ఎడమవైపు నుండి విడుదల యగును. ఇది నియమంగా జరుగుచుండును. అందుచే మొదటి బిడ్డ కలిగినప్పటి నుండి లెక్కవేసుకొనుచు వచ్చిన ఏ నెల యెటు వైపు అండకోశం నుండి అండం విడుదలయగుచున్నదో చెప్పవచ్చునని వ్రాసిరి. ఇదియును సత్యం కాదు. అండకోశ వ్యాధికారాణంగా కొందరిలో వ్యాధి గ్రస్థమైన అండమును తొలగించవలసి వచ్చును. ఒక అండమును తొలగించిన స్త్రీలకును మగ, ఆడ బిడ్డలు పుట్టుట జరిగినది. ఇటువంటివే ఎన్నో అభిప్రాయాలు దేశ విదేశాలలో పండిత పామరులలో కలవు. ఇందేదియు సిద్ధాంతీకరించ వీలులేదు.

ఆడ, మగ బిడ్డల విషయం మన చేతిలో లేక పోయినను కలగబోవు బిడ్డల ఆరోగ్య మానసిక ప్రవృత్తులు మన చేతిలో నున్నవని చాలామంది అభిప్రాయం. ఆయుర్వేద గ్రంథాలలో మంచి రూపవంతులైన బిడ్డల కొరకు స్త్రీలు ప్రాతః, సాయంకాలములందు తెల్లటి పుష్టివంతమైన యెద్దునుగాని, ఎర్రని యాబోతునుగాని చూడవలెనని "సాయంప్రాతశ్చ శశ్వత్ శ్వేతం మహాంతం వృషభభాజేనేయం వా హరిచందనాంగదం పశ్యేత్" అని చెప్పబడినది.

కొన్ని దేశాలలో మంచి గుఱ్ఱములు పుట్టుటకు ఆడగుఱ్ఱం ఎదుట ఏ

రంగు గుడ్డను వారు కోరెదరో ఆ రంగు గుడ్డాన్ని కట్టియుంచి మగగుడ్డంతో సమాగమం చేయించెదరు. వారు కోరిన రంగుగల గుడ్డములు కలుగుచున్నవని చెప్పుదురు. అనగా సమాగమం చేయుచున్నప్పుడు ఆడగుడ్డం ఎటువంటి రంగురూపులను చూచుచున్న అట్టి బిడ్డలను గనును. దీనిని ఆయుర్వేద గ్రంథాలలో స్త్రీలు **"తన్మనా బీజం గృహ్ణీయాత్"** "తమకు కావలసిన బిడ్డలను గూర్చి భావనచేయుచు తన్మయులై వీర్యధారణ చేయవలె"నని చెప్పబడింది. సమాగమం చేయునపుడు శరీరంలోని అన్ని అవయవాలు వికార రహితంగ నుండవలెననియు, మనస్సు ప్రసన్నంగా నుండవలెననియు, ఉన్నత భావాలుగల బిడ్డలను భావన చేయుచు నుండవలెననియు శాస్త్రాలు చెప్పును.

**"యస్య యస్య హి అంగావయవస్య బీజే బీజభాగః ఉపతప్తో భవతి, తస్య తస్య హి అంగావయవస్య వికృతిరుపజాయతే, నోపజాయతే చానుపతాపాత్, తస్మాత్ ఉపయోపపత్తిః"**:-అనగా మాతా పితరుల అంగాలలో నే యే వికారములుండునో అట్టి వికారాలు రజో వీర్యాలలో గూడా వచ్చును. వికారములు లేకున్న సంతానంలో వికారాలు రావు. ఈ విషయంనే నిరుక్త శాస్త్రం మరియొక విధంగా వర్ణించును.

**శ్లో॥ అంగాదంగాత్ సం భవసి హృదయాదధి జాయసే ।**

**ఆత్మా వై పుత్ర నామాసి స జీవ శరదః శతమ్ ॥**-నిరుక్తము(3-4)

సంతానం మాతా పితరుల అంగాంగముల ప్రతి రూపం. ఒక విధంగా వారి యాత్మయే. అట్టి బిడ్డ నూరు సంవత్సరాలు జీవించును గాక.

పై వర్ణనలను బట్టి గర్భాధాన సమయంలో స్త్రీ పురుషులు అది యొక పవిత్ర యజ్ఞంగా; తమకు, సమాజానికి మేలుచేయు ఉత్తమ మానవజాతి నిర్మాణమున కుపయోగపడు కార్యంగా భావించి; తన్మయులై, వికార రహితులై యీ క్రియను జరుపవలసి యున్నది. అట్టి ఉత్తమ మనోభావాలు వంశపారంపర్యంగా వచ్చు కొన్ని దుర్లక్షణాలను కూడా సంస్కరించి అట్టి గొప్ప భావాలు కలిగిన జీవాత్మ నాకర్షించి ధారణ చేయగలుగును. అందుకొర కిదియొక సంస్కారంగ నిర్దేశింపబడింది. ఆ దినమున నొక ప్రత్యేక హోమం చేయవలసి యుండును. ఆ మంత్రాలలో మరికొన్ని విశేష భావాలు గలవు. వాటిని కూడా తెలిసికొందము రండు.

## గర్భాధాన సంస్కారవిధి - ముఖ్య విషయాలు

అనుకూలమైన ఒక దినమున బంధు మిత్రుల సమక్షంలో చక్కగా సంస్కారం చేయించగల పురోహితుని ఆహ్వానించి సంస్కారమును జరిపించవలెను. సామాన్య యజ్ఞప్రకరణాన్ని పూర్తిగావించిన తదుపరి ఈ సంస్కారానికి సంబంధించిన విశేష హోమం చేయవలెను.

### ఇరువది ఆజ్యాహుతులు

ఈ సంస్కారంలోని ఇరువది విశేష మంత్రాలను నాలుగు పంచకాలుగా (వర్గాలుగా) విభజించ వచ్చును. అందు ప్రతి పంచకంలో భూ దేవత యైన అగ్ని, అంతరిక్ష దేవత యైన వాయువు, ద్యుస్థాన దేవతలైన సూర్య చంద్రులు, చివరగా పై నాలుగు దేవతలు కలిసి గర్భధారణ చేయబోవు స్త్రీని శారీరకంగా, మానసికంగా స్వస్థపరచి క్షేత్రాన్ని శుద్ధపరచుటకు ఆ యా దేవతలకు ఆహుతలిచ్చు ప్రక్రియ ఉండును.

మొదటి పంచకంలో **"యస్యాః పాపీ లక్ష్మీ స్తనూస్తామస్యా అపజహి"** - అన్యాయార్జితమైన వస్త్రాభూషణాలుగాని, బాహ్య శారీరక మలినాలుగాని యున్న యెడల వాటిని దూరం చేయవలెననెడి సూచన గలదు. బిడ్డలకు తల్లివలన కేవలం వంశపారంపర్య లక్షణాలతో బాటు తనదైన మానసిక ప్రభావ మధికంగా సంక్రమించును. కనుక, తల్లి యెంత పవిత్రురాలైన బిడ్డలంత పవిత్ర చరిత్ర గలవారగుదురు. అన్యాయార్జితమైన వస్త్రాభూషణాలు గాని, బాహ్య శారీరక మలినాలు గాని యున్నయెడల మనస్సుపై చెడ్డ ప్రభావాన్ని కలిగించును. ఆ ప్రభావం గర్భంలో పెరుగు బిడ్డలపై ప్రసరించును. కనుక, పై నలుగురు దేవతలకు అట్టి దోషాలను పోగొట్టుమని ప్రార్థించుచు నాహుతులిచ్చుట జరుగును. వైదిక ఋషులు ప్రార్థన ప్రయత్నంతో గూడియున్నప్పుడే ప్రార్థన యగుననియు, ప్రయత్నంలేని ప్రార్థన ప్రార్థనకాదనియు నమ్ముదురు. ఇచ్చట ప్రార్థించుట యనగా అటువంటి దోషాలు రాకుండుటకు గట్టి ప్రయత్నాలు చేయవలెనని భావం.

రెండవ పంచకంలో **"యస్యాః పతిఘ్నీ తనూస్తామస్యా అపజహి"** అను ప్రార్థన గలదు. అనగా పతిని హింసించు శారీరక మానసిక తత్వాలు ఈ

స్త్రీలో నున్నయెడల అవి దూరం కావలెనని భావం. స్త్రీలలో పతి శరీరతత్వమునకు వ్యతిరేకమైన తత్వమున్నయెడల కొన్ని బాధలు కలుగును. వాని వలన మనసు వికలమగును. అది బిడ్డపై చెడు ప్రభావం చూపును. అందుచే నా చెడు ప్రభావం తొలగవలెనని ప్రార్థన చేయబడినది. మందుల ద్వారా, తగిన మానసిక సంకల్పాల ద్వారా అట్టి దోషాలను పోగొట్టుకొన యత్నించవలెనని అభిప్రాయం.

మూడవ పంచకంలో – **"అపుత్ర్యా తనూస్తామస్యా అపజహి"** యను సూచన గలదు. అనగా బిడ్డలు కలుగుటకు ఏవైన అవరోధాలున్న యెడల గర్భకోశంనుండి యవి తొలగించుకోవలెనని భావం. అందుచే ఋతుస్రావంలో గాని, ఋతుక్రమంలో గాని ఏవైనా దోషాలున్న పోగొట్టుకొనుటకు ప్రయత్నించవలెను.

నాలుగవ పంచకంలో **"అపసవ్యా తనూస్తామస్యా అపజహి"** యను ప్రార్థన గలదు. అనగా ఈ స్త్రీలో పతితో సహకరించని లేదా పతి అభిరుచులకు భిన్నమైన అభిరుచులున్న నవి తొలగి పోవలెనని భావం. ఏలయన, పతిని హింసించక పోయినను సమాన అభిరుచులు లేకున్న వారి దాంపత్య జీవితం అన్యోన్యంగా నుండదు. అవి తొలగి పోవుటకు ఈ ప్రార్థన చేయబడినది. అనగా ఒకరి నొకరు అర్థం చేసికొనుచు ఒకరి భావాల నొకరు గౌరవించుకొనుచు ఉన్నప్పుడే మానసిక ప్రసన్నత కలుగును. అదే గర్భస్థ శిశువుల యున్నతికి దోహదం చేయును.

పై ప్రార్థనతో బాటు కొంత ప్రయత్నం కూడా జరిగినది. భూలోక దేవతలకు, ప్రాకృతిక శక్తులకు యజ్ఞాగ్ని ప్రతినిధి. ఆ యజ్ఞాగ్ని శరీరం లోపల, బయట గల యనేక దోషాలను పోగొట్టును. అటువంటి యజ్ఞాగ్నిలో నాహుతులిచ్చుట జరిగినది. అంతరిక్ష దేవతాశక్తులకు వాయువు ప్రతినిధి. యజ్ఞాగ్నినుండి వెలువడిన సూక్ష్మపదార్థాలతో గూడిన వాయువు రోగ నివారణకు, బలారోగ్యాలకు నెంతగానో తోడ్పడును. మన ఆరోగ్యంపై దాని ప్రభావం అత్యధికమని చెప్పవచ్చును. ద్యుస్థాన దేవతలలో సూర్యచంద్రులు ప్రధాన దేవతలు. మూడవ మంత్రంలో చంద్రుని సంబోధించుచు ప్రార్థన కలదు. యజ్ఞాగ్నిలో వేసిన పదార్థంలోని కొంత సూక్ష్మాంశం చంద్రుని చేరును.

చంద్రకిరణాలు మన ఆరోగ్యంపైనను భూగోళంపైనను తన ప్రభావమును చూపును. ముఖ్యంగా చంద్రకిరణాల ప్రభావం మన మనస్సుపై నెక్కువగా ప్రసరించును. సముద్రంపై ఆ ప్రభావం ప్రత్యక్షంగా కనబడును.

అమెరికాలోని నేషనల్ ఓపెన్ సర్వే అధికారి డా॥ ఫెర్గూస్‌వుడ్ ఒకసారి జోస్యం చెప్పెను. 1974 జనవరి 8 మరియు ఫిబ్రవరి 7వ తేదీలలో "సిజిగె" యేర్పడినపుడు సముద్రపు అలలు చాలా ఉవ్వెత్తుగా లేచునని చెప్పెను. అది సత్యమయ్యెను. "సిజిగె" యనగా సూర్యుడు, భూమి చంద్రుడు నొక సరళ రేఖపైకివచ్చుట. అపుడు చంద్రుడు భూమికి కొంత చేరువగును. అందుచే దానియాకర్షణ ప్రభావం నీటిపై ఎక్కువగానుండి యెత్తయిన అలలు లేచును.

సిజిగె ప్రభావం సముద్రము పైననేగాక త్రాగబోతుల పైన, మత్తుమందులు సేవించెడి వారిపైన, హిస్టీరియా మూర్ఛ పిచ్చి రోగులు పైనను పడునని డా॥ అర్నాల్డ్ లైబర్ ఆరువేల కేసులలో నిరూపించెను. వారిలో అబ్రహం లింకన్ ఒకరు. కొన్ని విషసంబంధమైన రోగాలు పౌర్ణిమ, అమావాస్యలకు హెచ్చుగుచుండును. ఆ కారణం యొక్క ఆధారంతో హోమియో వైద్యంలో సైలీషియా, కాల్కేరియా కార్బ్ మొదలగు మందులలో నొకదానిని ఎన్నుకొని వాడిన అద్భుతమైన శాశ్వత నివారణ జరుగును. పంటలు చక్కగా పండుటకు సూర్యకిరణాలతోపాటు చంద్రకిరణాలు కూడా అవసరమట. వీటి వలన విషాలు హరింపబడునను నమ్మకమును గలదు. అట్టి చంద్రకిరణాలు గర్భధారణ చేయబోవు స్త్రీ మనస్సును ప్రసన్నం చేయవలెనని ప్రార్థించుట జరిగినది.

ద్యుస్థాన దేవతలలోరెండవ దేవత సూర్యుడు, యజ్ఞాగ్నిలో వేసిన పదార్థంలోని సూక్ష్మాంశం, (హైడ్రోజన్ మరియు కొన్ని పరమాణు శకలాలు) భూ ఆకర్షణశక్తిని దాటి క్రమంగా సూర్యుని చేరి సూర్యునిలోని మంటలను భూవాతావరణమునకు అనుకూలంగా మార్చును. సూర్యునిలో హైడ్రోజన్ హీలియంగా మారునపుడు పెద్ద పెద్ద మంటలు లేచును. అవి సూర్యుని యందంతట సమానంగా గాక కొన్నిచోట్ల తక్కువగా నుండును. అవి మనకు దూరదర్శినిలో మచ్చలుగా కనబడును. వాటినే 'సన్ స్పాట్స్' అందురు. అవి భూ వాతావరణంపై తమ ప్రభావాన్ని చూపునట. తుఫానులు, ఉప్పెనలు, భూకంపాలు, మొదలగునవి వాటిలోని మార్పుల వలననే కలుగును. ప్లేగు,

కలరా, డిఫ్తీరియా, మశూచి మొదలగు సామూహిక రోగాలకును సన్‌స్పాట్స్ కారణమని కొంతమంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం.

సూర్యకిరణాలు ముఖ్యంగా ఉదయ సాయంకాలపు అల్ట్రావైలెట్ కిరణాలు క్రిమిసంహారకాలు. అవి మన శరీరంలో "ఎ" మరియు "డి" విటమిన్లను తయారుచేయును. సూర్యకిరణాలలోని వివిధ రంగులు వివిధ రోగాలను పోగొట్టునని సుప్రసిద్ధ ప్రకృతి వైద్యులు డా.ఇ.డి. బాబిట్ సప్రమాణికంగా నిరూపించిరి.

చివరి మంత్రంలో మరియొకసారి ముఖ్యమైన పై నాలుగు శక్తులను స్మరించుట జరిగినది. పై నాలుగు శక్తులు మన శరీరంలో ప్రాణ, అపాన, వ్యాన వాయువులవలె సృష్టిని నడిపించు చుండునని కొందరి వ్యాఖ్యానం. అగ్ని, వాయు, చంద్ర సూర్య పదములు ప్రాకృతిక శక్తులకే గాక సర్వనియంతయైన పరమేశ్వరునకును వర్తించును. పై ప్రాకృతిక శక్తులు మా కనుకూలంగా నుండునట్లు అనుగ్రహించుము లేదా మేము వాటిని మా కనుకూలంగా మార్చుకొనగలుగు బుద్ధిని మాకు ప్రసాదించుము అను పరమేశ్వర ప్రార్థనయు ఇందు గలదు.

ఈ సంస్కారంలోని వివిధ రకాల హోమాలు చేయునపుడు స్రువ (అగ్నిలో నేతిని వేయు పొడవు కాడగల ఒక చెంచా)తో ఆహుతి యిచ్చిన తదుపరి స్రువలో మిగిలిన ఒక బొట్టును ఒక కంచుపాత్రలో కొద్దిగా నీరు పోసి దానిలో వదిలి పెట్టుచు నుండవలెను. ఈ హోమాలు పూర్తియైన తదుపరి గర్భవతికాగోరు స్త్రీ యా నీటిని శరీరమునకు నఖశిఖ పర్యంతం చక్కగా మర్దన చేసికొని, స్నానం చేసి, నూతన వస్త్రాలు ధరించి యజ్ఞమండపానికి తిరిగి వచ్చు ఒక క్రియ కలదు. దీని వలన యజ్ఞవాయు ప్రభావం శరీరమునకు ఎక్కువగా లభించును. ప్రతి యాహుతికి స్రువ అగ్ని కుండమునకు పైన అగ్నికి సమీపంగా వెళ్లుట జరుగును. అందువలన నా స్రువకు యజ్ఞవాయువు ఎక్కువగా అంటును. ఆ శేషపదార్థం నీటిలో వదులుట వలన ప్రయత్నపూర్వకంగా యజ్ఞ వాయువును గ్రహించినట్లగును. ఈ విధంగా యీ సంస్కార మంతయు నెంతయో వైజ్ఞానికంగా నుండును.

**మూడవ క్రియ - షడన్నాహుతులు :** యజ్ఞక్రియకు ముందుగానే అన్నం,

నెయ్యి, పాలు, చెక్కెర నొక పాత్రలో బాగుగా కలిపి మెత్తగా పిసికి పెట్టుకొనవలెను. అది కొంత సేపటికి పలుచగా రసంగా మారును. ఆ రసంతో దంపతులు ఆహుతుల నియ్యవలయును. ప్రతి యాహుతి యంతమున స్రువలో రెండు మూడు బిందువులను మిగుల్చుచు దానిని ప్రత్యేకంగా నుంచుకొనిన కంచు జలపాత్రయందు వదలవలెను. అనగా ఆ బిందువులను పాత్ర యందు విడుచుచుండవలెను. ఈ మంత్రాలలో యజ్ఞాగ్నియొక్క గొప్ప గుణములు చెప్పబడినవి.

<u>మొదటి యాహుతి</u> **"ఓం అగ్నయే పవమానాయ స్వాహా"**

ఓ యజ్ఞాగ్నీ ! నీవు పవిత్రమైనదానవు.

<u>రెండవ యాహుతి</u> **"ఓం అగ్నయే పావకాయ స్వాహా"** ఓ యజ్ఞాగ్నీ! నీ వందరిని పవిత్ర పరచుదానవు

<u>మూడవ యాహుతి</u> **"ఓం అగ్నయే శుచయే స్వాహా"** ఓ యజ్ఞాగ్నీ! నీవు శుచి-సంస్కరించుదానవు. ఆకాశంలో విద్యుత్ వలె (మెఱుపువలె) వాతావరణాన్ని సంస్కరించు దానవు.

<u>నాలుగవ యాహుతి</u> **"ఓం ఆదిత్యై స్వాహా"** ఓ యజ్ఞాగ్నీ! నీవు సూర్యుని పోషించు దానవు.

<u>అయిదవ యాహుతి</u> **"ఓం ప్రజాపతయే స్వాహా"** ఓ యజ్ఞాగ్నీ! నీవు ప్రజలను పోషించు దానవు.

<u>ఆరవ యాహుతి</u> ''ప్రాయశ్చిత్తాహుతి'' ''యదన్య కర్మణోఽత్యరీరిచం.....'' హే పరమేశ్వర ! ఈ యజ్ఞక్రియలో నాహుతులిచ్చు చున్నప్పుడు అజ్ఞానం వలన గాని, అభావంవలన గాని న్యూనాధికాలు జరిగిన వాటివలన నే ప్రాణికిని హాని కలుగకుండునట్లు కాపాడుము.

**నాలుగవ క్రియ - ఎనిమిది ఆజ్యాహుతులు :** ఈ యెనిమిది మంత్రాలలో కూడా యాజ్ఞగ్నియొక్క ప్రయోజనాలు వర్ణించబడినవి. వాటిని గుఱించి మఱియొక వ్యాసంలో వివరంగా తెలిసికొందము.

**అయిదవ క్రియ - తొమ్మిది ఆజ్యపాకాహుతులు: -** మన ప్రయత్నంతో బాటు పరమేశ్వరుని అనుగ్రహమును అవసరమే. కనుక పరమేశ్వరుని ప్రార్థిస్తూ

ఈ ఆహుతులిచ్చుట జరుగును. నేతితోపాటు మోహనభోగం (ప్రత్యేకంగా వండిన అన్నం)ను ఆహుతిగా నివ్వవలెను. ఈ వేదమంత్రాలలో పరమేశ్వరుడు ఆదిమానవులకు గర్భధారణ, ప్రసూతి విజ్ఞానాల నుపదేశించెను. ఆ మంత్రాలను మననం చేసి ఋషులు ఆయుర్వేదాది శాస్త్రాలను రచించిరి. అవే ఆధునిక వైద్య విజ్ఞానానికి ఆధారాలు. అందుచే వీటి సంక్షిప్తార్థమును ఇచట తెలిసికొందాము.

**ఓం విష్ణుర్యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు ।**
**ఆ సించతు ప్రజాపతిర్ధాతా గర్భం దధాతు తే స్వాహా ॥**

(ఋ. 10-184-1)

అర్థము : (విష్ణుః) సర్వవ్యాపక ప్రపంచధారక శక్తియైన పరమాత్మ (తే యోనిం) నీ గర్భాశయాన్ని (కల్పయతు) సుదృఢంగా, విశాలంగా చేయును గాక! (త్వష్టా) ప్రపంచాన్ని రూపకల్పన చేసిన ఈశ్వరశక్తి (రూపాణి) గర్భంలో పెరుగు బిడ్డ శరీరంయొక్క రూపాన్ని (పింశతు) చక్కటి రంగు రూప లావణ్యాదులతో సుందరంగా నిర్మించును గాక ! (ప్రజాపతిః) సర్వప్రాణి పోషకుడగు పరమాత్మ (ఆ సించతు) చక్కటి పోషక పదార్థాలతో, సప్తధాతువులతో కూడిన నీ గర్భమును తడుపును గాక - రైతు పొలమును తడుపునట్లు పోషించునుగాక! (ధాతా తే గర్భం దధాతు) ప్రపంచధారకశక్తి నీ గర్భమును పతనం గాకుండా చక్కగా కాపాడును గాక !

**ఓం గర్భం ధేహి సినీవాలి గర్భం ధేహి సరస్వతి ।**
**గర్భం తే అశ్వినౌ దేవావాధాత్తాం పుష్కరస్రజౌ స్వాహా ॥**

(ఋ. 10-184-2)

అర్థము : (సినీవాలి) ఓ అన్నపూర్ణా! అన్నపుష్టి, శరీరపుష్టి కలిగిన ప్రసన్నవదనా! (గర్భం ధేహి) గర్భమును ధరింపజేయుము. (సరస్వతి) ఓ విద్యావతీ! (గర్భం ధేహి) గర్భమును ధరింపజేయుము. (తే గర్భం) నీ గర్భమును (అశ్వినౌదేవౌ) అశ్వినీ దేవతలు, ప్రాణ-అపానములు (ఆ ధత్తాం) బాగుగా పోషించెదరు గాక! (పుష్కర స్రజౌ) పుష్టి కలిగిన రజో వీర్యములను మనకు యిత్తురు గాక!

ఓం హిరణ్యయీ అరణీ యం నిర్మంథతో అశ్వినా ।
తం తే గర్భం హవామహే దశమే మాసి సూతవే స్వాహా ॥
(ఋ. 10-184-3)

అర్థము : (యం) ఏ విధంగా (నిర్మంథతో అశ్వినౌ) అశ్వినీ దేవతల మంథనము వలన - సహకారం వలన (హిరణ్యయీ అరణీ) బంగారం వంటి తేజస్సుగల అగ్ని అరణులద్వారా ఉత్పన్నమగునో (తం తే గర్భం) అట్లే మన రజో వీర్యముల మంథనమువలన నీకు గర్భం ప్రాప్తించును గాక! (దశమే మాసి సూతవే) పదవ మాసమున కలిగెడు ఆ సుసంతానమును (హవామహే) మేము ఆహ్వానించుచున్నాము.

**ఓం రేతో మూత్రం వి జహాతి యోనిం ప్రవిశదింద్రియమ్ ।**
**గర్భో జరాయుణావృత౽ఉల్వం జహాతి జన్మనా ।**
**ఋతేన సత్యమింద్రియం విపానం శుక్ర మంధస ౽ ఇంద్ర**
**స్యేంద్రియ మిదం పయో౽మృతం మధు స్వాహా ॥**
(యజుర్వేదం. 19-76)

**అర్థము :** (ఇంద్రియం) పురుషుని శిశ్నేంద్రియము (యోనిం) స్త్రీ యోనియందు (ప్రవిశత్) ప్రవేశించి (రేతః) రేతస్సును - వీర్యమును (విజహాతి) విశేషించి వదలి పెట్టుచున్నది. [దానికి భిన్నముగా విడిగా నున్నపుడు] (మూత్రం) మూత్రమును విడిచి పెట్టును. (జరాయుజా) ఆ వీర్యము మావితో (అవృతః) కప్పబడినదై (గర్భః) గర్భరూపమును పొందుచున్నది. (జన్మనా ఉల్వం జహాతి) ప్రసవ సమయంలో ఆవరణమును - మావిని వదలుచున్నది. (ఋతేన సత్యమింద్రియం) ఋత సత్యములతో పవిత్రమైన లింగము - వ్యభిచార రోగాదులు లేని పవిత్ర శిశ్నేంద్రియము (విపానం శుక్రం అంధస) బలవీర్యములు కలిగిన సంతానము నుత్పన్నము చేయ సమర్థవంతమగును. అట్టి వీర్యము పురుషుని శరీరంలో దాగి యుండును. అది సంతాన రూప జ్యోతిగా - బీజం వృక్షమైనట్లుగా వెలుగొందును. (ఇదం ఇంద్రస్య ఇంద్రియం) ఇట్టి మహిమాన్విత శిశ్నేంద్రియ, వీర్యములు జీవునకు సుఖసాధనాలు. (పయః అమృతం మధు) వీర్యము పాలవంటి పోషకవంతమైనది. అమృతంవంటి జీవన వర్ధకం. తేనె

వంటి మాధుర్య వర్ధకం.

ఓం యత్తే సుసీమే హృదయం దివి చంద్రమసి శ్రితమ్ ।
వేదాహం తన్మాం తద్విద్యాత్ । పశ్యేమ శరదః శతం
జీవేమ శరదః శతం, శృణుయామ శరదః శతం
ప్రబ్రవామ శరదశ్శతమదీనాః స్యామ శరదః శతం
భూయాశ్చ శరదః శతాత్ స్వాహా ॥

(పారస్కర గృహ్య సూత్రములు. 1-11-9 మరియు యజు. 36-24)

అర్థము : (సుసీమే) సకేశనీ! (మంచి కేశసంపద కలదానా!) (యత్+తే హృదయం) ఏ నీ హృదయం (దివి చంద్రమసి శ్రితమ్) ఆకాశమున చంద్రునివలె ప్రకాశిస్తూ ఆహ్లాదాన్ని కలుగజేయుచున్నట్లు (తత్ వేదాహం) ఆ విధంగా నాకు అనుభూత మగుచున్నది. (తత్ + మాం విద్యాత్) నీవుకూడా నన్ను అట్లే (చంద్రుని వలె) గ్రహింపుము, (పశ్యేమ శరదః శతం) మన మిరువురము నూరు సంవత్సరాలు చక్కగా ఈ సృష్టిని అవలోకించెదము గాక! (జీవేమ శరదః శతం) నూరు సంవత్సరాలు ఆరోగ్యవంతులమై జీవించెదము గాక! (శృణుయామ శరదః శతం) నూరు సంవత్సరాలు మనము విన్న విజ్ఞానమును ప్రవచించెదము గాక! (అదీనాః స్యామ శరదః శతం) నూరు సంవత్సరాలు పరాధీనులముగాక స్వాధీనులమై జీవించెదముగా-క! (భూయశ్చ శరదః శతాత్) ఆయురారోగ్యాలతో నూరు సంవత్సరాల కన్న ఎక్కువగా జీవించ ప్రయత్నించెదము గాక!

వ్యాఖ్యానము : పత్నికి పతిహృదయం పౌర్ణమినాటి చంద్రుని వలె అనుభూత మగును. అట్లే పత్నిహృదయం పతికిగూడా పౌర్ణమినాటి చంద్రునివలె అనుభవం కావలెను. అప్పుడే వారి అన్యోన్యత వృద్ధి చెందును. 'హృదయ' పదాన్ని నిరుక్త శాస్త్రకారుడైన యాస్క మహర్షి చాలా వైజ్ఞానికంగా వివరించెను. (క్రీ.శ. 1578-1657) యూరోపుదేశస్థుడైన డా॥ హార్వే మహాశయుడు హృదయము చెడురక్తాన్ని గ్రహించి ఊపిరితిత్తుల ద్వారా శుద్ధపరచి మంచి రక్తాన్ని శరీరమంతటికి పంపు నను విషయం కనిపెట్టినట్లు లోకంలో చెప్పుదురు. కాని కాలగణనకే అందని యతిప్రాచీన ఋషియైన యాస్కుడు హృదయ పదాన్ని

నిర్వచించుచు ఇట్లు చెప్పెను - "హృదయ పదము హృ+ద+య ల కలయిక వలన ఏర్పడినది. 1. హృ-హరణే (హరతి - గ్రహించును) చెడు రక్తమును గ్రహించును. 2. ద-దానే (దదాతి - ఇచ్చును) మంచి రక్తమును శరీరమంతటికి ఇచ్చును. 3. య-ఇణ్ గతౌ-యాతి నడచును (ఎప్పుడును నడచుచుండును)." బృహదారణ్య కోపనిషత్తు నందును (5వ అధ్యాయం 3వ ప్రకరణంలో) పై విధంగానే వివరింపబడినది.

**ఓం యథేయం పృథివీ మహీ భూతానాం గర్భమాదధే ।**

**ఏవా తే ధ్రియతాం గర్భో అనుసూతం సవితవే స్వాహా ॥**

(అథర్వవేదము. 6-17-1)

అర్థము : (యథా ఇయం మహీ పృథివీ) ఏ విధంగా మహిమాన్వితమైన, విస్తారమైన భూమి (భూతానాం గర్భం అదధే) సమస్త ప్రాణులను తన గర్భమునందు (పైన) ధరించుచున్నదో (ఏవాతే గర్భోధ్రియతామ్) అటులనే నీ గర్భమున శిశువు ధరింపబడును గాక! (అనుసూతం సవితవే) ప్రసవించుటకు గర్భస్థశిశువు అనుకూలంగా నుండును గాక!

వీటి తరువాత వచ్చు మూడు మంత్రాలలోను ఇటువంటి భావాలే కలవు. "వృక్షములను, పర్వతములను, సకల పదార్థములను భూమి తన గర్భమున ధరించుచున్నట్లే నీ గర్భమున శిశువు చక్కగా ధరింపబడును గాక !" యను ప్రార్థన ఆ మూడు మంత్రాలలో గలదు.

**అరవ క్రియ - వ్యాహృత్యాహుతులు :** ఈ నాలుగు మంత్రాలలో - ఈ మంత్రాలతో వేసిన పదార్థాలు భూలోకమున అగ్ని రూపమును, భువర్లోకమున వాయురూపమును, స్వర్లోకమున ఆదిత్యరూపమును పొంది మన శరీరాలలో ప్రాణాపానవ్యాన వాయువుల వలె ఈ దంపతులకు మేలు చేయవలెనను ప్రార్థన కలదు. తదుపరి రెండు ఘృతాహుతులు, నొక స్విష్టకృదాహుతిని ఇచ్చి తరువాత క్రియకు వధువును సిద్ధం చేయవలెను.

**వధువునకు ఘృత స్నానము :** పైన వివరించిన విధంగా కంచు జలపాత్రమునందు సేకరించిన హుతశేషమును తీసికొని వధువు స్నాన గృహమున కేగి శరీరమున కంతటికిని నఖ శిఖ పర్యంతం రాచుకొని శిరస్నానం

చేయవలెను. ఈ ఘృతశేషంలో మనం ప్రయత్నపూర్వకంగా సేకరించిన యజ్ఞవాయు ప్రభావం విశేషంగా ఉండును. అది శరీరానికి రాచుకొనుటవలన శరీరంలోనికి ఇంకును. స్నానం తదుపరి శుద్ధవస్త్రాల ధరించి హోమకుండం చెంతకు రావలయును. అప్పుడు వధూవరులిరువురు యజ్ఞకుండమునకు ప్రదక్షిణ చేసి సూర్యదర్శనం చేయవలెను.

సూర్యదర్శనం చేయుచు కొన్ని మంత్రాలతో పరమేశ్వర ప్రార్థన చేయు విధానం కలదు. ఆ మంత్రాలలో సూర్యుడు ఈ లోకములన్నిటిని రక్షించునట్లు ఈమె గర్భమునుకూడా రక్షించవలెననియు, ఈ గర్భమును చక్కగా పోషించవలెననియు ప్రార్థన కలదు.

పై మంత్రాల ద్వారా క్రియలద్వారా మనకు కొన్ని ప్రేరణలు లభించుచున్నవి. ఒకటి - ఈమె గర్భమున పెరుగు సంతానం ఒక గుర్తింపబడిన ఆదర్శవ్యక్తి యగుటకు ప్రయత్నించుట. రెండు - నూరు సంవత్సరాలు ఆరోగ్యంగా జీవించుటకు కావలసిన ధాతుపుష్టిని కలుగజేయుటకు యత్నించుట. మూడు - భూలోక, భువర్లోక, స్వర్లోకముల ద్వారా యెట్టి ఆపదా రాకుండా రక్షించుట. నాలుగు - సమస్త ప్రాకృతిక పదార్థాలయందు పరమాత్మ వ్యాపించియున్నట్లు అనుభూతం చేసికొనుట. అయిదు - మన నేత్రాలు కేవలం మన కంటి యెదుటిగా నున్న వాటినేగాక సూర్యునివలె అన్నివైపుల, అన్ని విషయాలను చక్కగా గ్రహించునట్లు ప్రయత్నించుట - అను ప్రేరణలు ఈ మంత్రాలలో గలవు.

**గోత్రపరివర్తనము - పతికి నమస్కారము :** ఈ క్రియలో వధువు పతికి నమస్కరించుచు తన నామమునకు ముందు పతి గోత్రమును చేర్చి **"అహం భో భవంత మభివాదయామి"** అని నమస్కరించవలెను. ఇప్పటినుండి ఆమె గోత్రం భర్తగోత్ర మగును. ఈ క్రియలో వధువు యొక్క త్యాగం, విశాల హృదయం, పాతివ్రత్యం వ్యక్తమగును. పత్నికి ప్రాచీన శాస్త్రాలలో "దుహిత" అను పేరు కలదు. "దుహిత" యనగా 'దూరంగా హితము చేయున' దని అర్థం. తా నొకరింట పుట్టి మరియొకరి యింటికి వెళ్ళి వారి యున్నతికి తన జీవితము నంకితము చేయును. తనకు కలిగిన సంతానమును కూడా తన

భర్త యింటికి అప్పగించును. అంతమాత్రంచేత భారతీయ సంస్కృతిలో స్త్రీని తక్కువగా చూసినట్లు భావించరాదు. ఆ వధువు పతిగృహమున కొక దాసిగాగాక సామ్రాజ్ఞిగా వెళ్లుచున్నది. ఈ విషయమును వేదము చాలా చక్కగా వర్ణించును.

**సమ్రాజ్ఞీ శ్వశురే భవ సామ్రాజ్ఞీ శ్వశ్రాం భవ ।**
**ననాందరి సమ్రాజ్ఞీ భవ సమ్రాజ్ఞీ అధి దేవృషు ॥**

(ఋగ్వేదము. 10-85-46)

**సామ్రాజ్ఞ్యేధి శ్వశురేషు సామ్రాజ్ఞ్యుత దేవృషు ।**
**ననాందుః సామ్రాజ్ఞ్యేధి సమ్రాజ్ఞ్యుత శ్వశ్రావమ్ ॥**

(అథర్వ. 14-1-44)

పై రెండు మంత్రాలలో వధువు పతిగృహ సామ్రాజ్యమునకు సామ్రాజ్ఞి యనియు; అంతేగాక, శ్వశురే (అత్తకు) శ్వశ్రాం (మామకు) ననాందరి (ఆడబిడ్డలకు) దేవృషు (మరదులకు) సామ్రాజ్ఞి యగుననియు చెప్పబడినది. ఇటువంటి వెన్నియో మంత్రాలు వేదములందు గలవు. వేదములలో స్త్రీ ధరణా, ధర్త్రీ, యంత్రీ, విశ్వచ్ఛాయా, సరస్వతీ మొదలైన వీరనామములతో సంబోధింపబడినది.

ఇప్పటినుండి స్త్రీ పతిగోత్రము కలదగును. తదుపరి వధూవరు లిరువురును వేదికకు పశ్చిమ భాగమున పూర్వాభిముఖులై కూర్చుండి వామదేవ్యగానము చేయవలెను.

యజ్ఞానంతరం శాంతి కొరకు మహావామదేవ్యగానం చేయవలె నను విధి గృహ్యసూత్ర గ్రంథాలలో గనబడుచున్నది. 'అపవృక్తే కర్మణి **వామదేవ్యగానం శాంత్యర్థం, శాంత్యర్థం'** (గోభిలీయ గృహ్యసూత్రము. 6-25) అందుచే సామవేదపాఠం నేర్చిన బ్రాహ్మణాదులచే ఈ గానం చేయించవలెను. ఇవి సామవేద ఉత్తరార్చికలోని యొకటవ యధ్యాయములో నాలుగవ ఖండములోని మంత్రాలు. ఈ మంత్రాలందు పరమేశ్వరోపాసన గలదు. పరమేశ్వరుడు సదా మన యున్నతినిగోరు పూజింపదగిన నిజమైన మిత్రుడనియు, అతడు మనకు సద్బుద్ధినిచ్చి చక్కగా కాపాడవలెననియు, అవిద్యాంధకారంనుండి తప్పించి యానంద ప్రాప్తి నొసగవలెననియు, మమ్ము

మా పరివారమును అనంత భవసాగర కష్టాలనుండి కాపాడవలెననియు ప్రార్థన గలదు. అనంతరం పురోహితాదులను యథోచితంగా సత్కరించి, అందరికి వీడ్కోలు చెప్పి వధూవరులిరువురును మధుర సాత్వికాహారమును భుజించవలెను.

గర్భాధాన క్రియ : ఈ క్రియకు రాత్రి రెండవ, మూడవ జాములు ఉచితమైనవి. ఇరువురును ఆరోగ్యము కలవారై పరస్పర ప్రేమతో నిండియున్నప్పుడు పునస్సంధానము జరుగవలెను.

వీర్యం గర్భస్థిత మగుచున్నపుడు పతీపత్ను లిరువురు ప్రసన్నులై యుండవలెను. ముఖ నాసికాది అవయవాలు పరస్పరం అభిముఖంగా, స్థిరంగా నుండవలెను. వీర్యస్ఖలన మైనప్పుడు స్త్రీ తన మూలేంద్రియమును, జననేంద్రియమును సంకోచింపజేసి వీర్యమును లోనికి ఆకర్షింపవలెను. దీనివలన వీర్యం గర్భాశయమును జేరుటకు అనుకూలంగా నుండును.

తదుపరి కొంత తడవుండి స్నానం చేయవలెను. వాతావరణం చలిగానున్న యెడల కుంకుమపువ్వు, కస్తూరి, జాజికాయ, జాపత్రి, యాలకులు వేసి కాచి చల్లార్చిన పాలను యథేష్టముగా త్రాగవలెను. అనంతరం వేరువేరుగా శయనించవలెను.

గర్భం ఏర్పడినట్లు నిశ్చయమైనచో మరునాడును (సూక్ష్మ గ్రహణశక్తి గల స్త్రీకి గర్భం స్థిరపబడినట్లు వెంటనే అనుభవమగును) లేని పక్షమున యొక నెలదినములు గడచిన వెనుక ఋతువు కనబడక పోయిన గర్భము స్థిరమైనట్లుగా భావించి ఒక విశేష హోమం చేయవలెను.

## -:ఉత్తర విధి - విశేష హోమ మంత్రములు :-

ఉత్తరవిధిలో సామాన్య ప్రకరణ విధిని పూర్తిగావించి యేడు విశేషమంత్రాలతో నాహుతులివ్వవలె నను విధానం గలదు. ఈ మంత్రాలందు గాలి తటాకంలోని జలమును అన్నివైపులనుండి తాకి యలలను లేపునట్లు ఈ గర్భం వికసించవలె ననియు; ఎట్లు గాలి చలించునో, గాలి వలన వృక్షములు చలించునో, సముద్రమున కెరటములు నిరంతరము చలించుచుండునో అటులనే నీ గర్భములోని శిశువు నవమాసములు చలించుచు వృద్ధిచెంది, తదుపరి మావితో ప్రసవించవలె ననియు ; గర్భములో శిశువు ఏ అంగలోపములేక, తల్లికి ఏవిధమైన కష్టము కలిగించక సుఖప్రసవము

గావలెననియు ప్రార్థన గలదు. ఈ మంత్రాలు అందుకు తగిన జాగ్రత్తలు తీసుకొనవలెనని మనకు ప్రేరణ నిచ్చుచున్నవి.

తదుపరి యజ్ఞవిధిని పూర్తిచేసి పూర్ణాహుతుల నిచ్చి శాంతి పాఠంతో ముగించవలెను.

మహర్షి దయానంద సరస్వతులవారు తమ 'సంస్కారవిధి' యను గ్రంథమునందు ఈ మొదటి సంస్కారమైన గర్భాధాన సంస్కారమునకు ఎక్కువ మహత్వమున్నట్లుగా వ్రాసిరి. దీనిపైననే మిగతా సంస్కారాలు ఆధారపడియున్నవని చెప్పిరి. అందుకొరకు ఆయుర్వేద గ్రంథాలలో ప్రముఖంగా వర్ణింపబడిన కొన్ని వైద్య ప్రక్రియలు కూడా సంతానం కలుగని వారి కొఱకు సూచించిరి. వాటిని గురించి పరిశోధించవలసి యున్నది. ఉత్తమ సంతానముపైననే మానవజాతి భవిష్యత్తు ఆధారపడునని చెప్పుచు మహర్షి దయానందులు -

"ఎట్లు సమస్త పదార్థములను ఉత్కృష్టముగా చేయు విద్యలు కలవో యటులనే ఉత్కృష్టమైన సంతానము కలుగుటకు ఈ విద్య కలదు. దీనిపై మనుజులు విశేషముగా ధ్యాన ముంచతగును. ఏలయన ఇది లేకపోయిన కులమునకు (వంశమునకు) హానియు, నీచత్వమును ; ఇదియున్నచో కులమున కభివృద్ధియు, నుత్తమతయు నవశ్యముగా సంప్రాప్తమగు"నని చెప్పిరి.

'ఉత్తమ మానవ నిర్మాణ' మనే భవనానికి ఈ గర్భాధాన సంస్కారము శిలాన్యాసము - (శంఖుస్థాపన-ఫౌండేషన్ స్టోన్) వంటిది. ఆ ఆధారశిల ఉత్తమమైనది, దృఢమైనదిగా ఉండటం ఎంతైనా అవసరం. దానికి పవిత్రభావం, ప్రసన్నత, దృఢసంకల్పం, దీక్ష, కృషి మొదలైనవి తోడయితే ఉత్తమ మానవజాతి నిర్మాణం సాధ్యమే. తద్వారా వైయక్తిక, సామాజిక, రాష్ట్రీయ, సార్వభౌమిక ప్రయోజనము లన్నియు సిద్ధించును. అందుకు మనమంతా యత్నింతము రండు.

లోకాః సమస్తాః సుఖినో భవన్తు

శమ్ ఇతి ఓ౩మ్

# గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణలు

వేదాలలో సూర్యకిరణ చికిత్స (40-00), వేదాలలో జలచికిత్స (20-00), వైదిక క్రాంతి పథం (15-00), దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణిస్త్రీ) (30-00), అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ (20-00), గర్భధాన విజ్ఞానము (50-00), మానవ ధర్మము (25-00), అశ్వినీ దేవతలు (20-00), సంధ్యా వందనము - వైజ్ఞానిక సమాలోచనము (20-00), అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము (30-00), గంగాధర శివుడు (5-00), గోమాత (30-00), గాయత్రీ విజ్ఞానం (50-00), జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ (60-00), స్వాతంత్ర్య సముపార్జనలో మహర్షి దయానందుడు (10-00), మన ఇతిహాసం (70-00), మన వేదశాస్త్రాల పరిచయం (50-00), చతుర్దశ భువనములు (10-00), ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ (10-00), యుగపురుషుడు శ్రీకృష్ణుడు (8-00), ధర్మవీర్ పం. లేఖరామ్ (3-00), వేదాలలో అప్సరస గంధర్వులు (2-50), యజ్ఞోపవీత వైశిష్ట్యము (2-00), లక్ష్మీ సూక్తము (2-00), శాంతి ప్రార్థన (2-00), దగ్రేట్ గాయత్రి (2-00), వైదిక అర్థనీతి (2-00), స్వరాజ్య సంగ్రామంలో ఆర్యసమాజము (8-00), సత్యధర్మవిచారణ (6-00), వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం (10-00), మరణానంతరం జీవుని ప్రయాణము (40-00), ప్రణవ స్తోత్రం (10-00), అహల్య రాయిగా మారలేదు (2-00), మాతాపుత్రికల జ్ఞానచర్చ (60-00), వేదాల వెలుగు చూపే ఆర్యసమాజము (20-00), చతుర్వేద సరస్వతీ సూక్తము (10-00), పురుష సూక్తము (20-00), వేదాలలో వర్షేష్టి విజ్ఞానం (25-00) ఈశావాస్యమిదం సర్వమ్ (35-00), వైదిక శాంతిపాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) (20-00), పండుగల పరమార్థం (40-00).

(20-1-2016)

Gayatri Series No. 22

# GARBHADANA VIGNANAMU

Rs.50



"నిషేకాది శ్మశానాన్తో మంత్రైః యస్య ఉదితో విధిః॥"
(మనుస్మృతి: 2-16)

నిషేకం (గర్భాధాన సంస్కారం) మొదలు శ్మశానాంతం అనగా అంత్యేష్టి (మృత్యువునకు పిమ్మట మృతక శరీరమును విధి పూర్వకంగ దహనం చేయుట) వరకు గల పదహారు సంస్కారాలు వేద మంత్రాలతో అగ్నిహోత్ర విధి పూర్వకంగ జరుపుకొనవలెను.

Published by :
GAYATRI ASHRAM TRUST
12-10-586/6, Arya Samaj - Vyas Nagar, Medibavi,
Warasiguda, Secunderabad - 500 061.
(Secretary : SRI K.P. NARSING RAO, Cell : 98480 11073)